# మాలతి

(రెండవ భాగము)

గ్రంథకర్త:

సూరంపూడి వేంకటసుబ్బారావు.



ప్రకాశకులు:

పులిపాటి రంగయ్య,

శ్రీరంగా బుక్ డిపో, చీరాల.

# దస్తావేజులమతలబు.

లోకవ్యవహారమునందు ప్రవేశముగల ప్రతివారికిని అత్యంత ప్రయోజనకరమైన గ్రంథము. అర్జీలు-పిటీషనులు-ప్రోనోట్లు- ఇల్లు భూమి తనఖాదస్తావేజులు- పంచాయితీ తీర్పులు- డిక్రీట్రాన్సుఫర్లు ప్రోనోటుట్రాన్సుఫర్లు- పారీఖత్తులు- మరణశాసనములు- పిల్లదత్తతదస్తావేజులు- దత్తతఅధికారపత్రములు- దానపత్రములు-మనోవృత్తిదస్తావేజులు- కవుళ్ళుకడపాలు-ఖండగుత్తకవుళ్ళు-అద్దెచీట్లు- హక్కువిడుదలదస్తావేజులు-గోడ సందు హక్కులనుగూర్చి- మనోవృత్తి హక్కులనుగూర్చి-ఇల్లుక్రయము రద్దు-పవర్ ఆఫ్ ఎటర్నీలు-పారీవ్యాపారపుదస్తావేజులు- రశీదులు- అదియిదియననేల? వ్యవహారసంబంధమైన సర్వవిషయము లిందుగలవు ప్లీడర్లయొక్కగాని ప్రయివేట్లయొక్కగాని సహాయము లేకయే స్వయముగా సర్వవిషయములను ఈగ్రంథసహాయమున నిర్వహించుకొన వచ్చును. గృహమున నీగ్రంథమొక్కటి యున్నచో గొప్పసలహాలనిచ్చు ప్లీడరు నొకని కొనియుంచుకొనినంత ఫలమిచ్చును.

వెల 0—12—0

☞ వలయువారు:—

పులిపాటి రంగయ్య,

శ్రీరంగాబుక్కుడిపో, చీరాల.

# మాలతి

(రెండవ భాగము)

గ్రంథకర్త:

సూరంపూడి వేంకటసుబ్బారావు



పబ్లిషరు:

పులిపాటి రంగయ్య,

శ్రీరంగా బుక్ డిపో, చీరాల.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజమహేంద్రవరమున

శ్రీరామముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను



[వెల 0—12—0



# మాలతి



## పదునేనవ ప్రకరణము.

### పలాయనము.

అయ్యో! మాలతీ! మాలతీ!! ఏమమ్మా యెంతపిలిచినను పలుకవేమమ్మా. అని మాలతి యంతఃపురమంతయు ప్రతిగదిని వేయి కన్నులతో సుకేశిని వెదకుచుండెను. ఆమె విహరించు యుద్యానవనమునంగల ప్రతి లతానికుంజముల మాటున ఎలుగెత్తి బిలచుచుండెను. ఎచటను మాలతిగాన్పింపలేదు. ఎందు మాలతిదాగియుండెను. ఎచట మాలతి కాపుత్తులుగలరు. అని వితర్కించుచూ సుకేశిని కనుగొనల జలముల రాల్చుచుండెను.

అకటా అలనాడు జగన్నాథ జోస్యులవారు నీవుమహారాణివగుదువనియు, నీకష్టములన్నియు నివారణమైపోవుచుండెననియు నుడివినపల్కుల కెంతవ్యతిరేకము జరిగిపోయెను.

మాలతి జయసేనుని కిచ్చునటుల తల్లి యెరింగియుండెను. ఆనాటినుండియు భర్తను వేడుకొన్న ఫలమించుకయును లేకపోవుటచే ఆమె దీర్ఘమనోవేదనతో మంచముబట్టెను. ఈఘోరవార్త యామెకుకూడ దెలిసిపోయెను. ఆమె మొదలు నరికిన వృక్షమువోడవున బడిపోయెను. ఆ తల్లి దుఃఖమెవ్వరికుండును.

రఘునాథుడస్తిమిత హృదయముతో యొక వరండాయందు యిటునటు విచారముచేయుచుండెను. మాలతి ఫలాయిత యొకచారుడు వెడలి చెప్పియుండెను.

'సరే, పొమ్ము' అనిమాత్రము పల్కి తన హృదయములో ఎద్దియో యోచించుకొనుచుండెను.

ఎట్టయెదుట మాలతి యున్నంతవరకున్న ధైర్యము మాలతి మరుగుపడినంతనే ఎక్కడలేని విచారము దలచుట్టుకొనెను. ఆతని హృదయము చేయివెట్టి కలచినట్లయ్యెను. ఈ సరికి వివాహము అయియుండును. అనిమాత్రము తలచుచుండెను. ఒక్కొక్కప్పుడు సర్వనాశనమై పోవుచున్నదాయని ఎంచుచుండును. మరియొకప్పుడేదియెటుల జరుగునో విధిప్రేరణమెవ్వరెరుంగుదురు. అని పరిపరి విధముల తలంపులతో అటనే యొక పర్యంకముపై బడిపోయెను.

ఇంతలో కుమార్తె వియోగ దుఃఖము భరింపజాలక వజ్రమునూరి ఆత్మహత్య గావించుకొన్న భార్యయయిన మాధవిశరీరమచటకు దెచ్చి పరిజనులు గొల్లుననేడ్చుచువచ్చిరి

రఘునాథుడు నెవ్వెరబడిపోయెను. అతని హృదయము అతనికే చాల వికృతముగనుండెను. ప్రణయస్వరూపిణి, ప్రణయానందదాయిని యగు యిల్లాలు అకాలమరణమొందెను. పుత్రిక శృంగారంపుటునతి, గుణవంతురాలు, యగు మాలతి గృహత్యాగియై అన్యాయపాలు బడిపోయినది.

ఇక నేమున్నది. అంతయు పరిసమాప్తి నొందుచున్నది.

రాజ్యము కొన్ని నరబలులు జరిగినగాని చేబడదు గదా! రాజ్యమే సుఖంపజేయును. రాజ్యమే దుర్భరదుఃఖ మొనవింపజేయును. రాజ్యమే భార్యాపుత్రుల విడదీయును. రాజ్యమే బంధుహితుల గర్భశత్రువులగజేయును. అయ్యో! ఓ రాజ్యలక్ష్మీ ఇంతజేసినను నీవొకరిని నమ్మియుందువా? కల్ల. నీకు చపలత్వము గలదు. ఆచంచలతచే కొలది కాలముననైనను జరుగకుండ నీసుఖంబొందవకపూర్వము నీసుఖంబొందిన వెంటనే తిరిగి మరియొకరి నాశ్రయించు కుటిలాత్మురాలవు. అకటా నిన్నజూచి నీనందదజూచి నీయందున్న రత్నములుజూచి రాజాధిరాజులను మోహింపజేతువు. అంతలో తగనిఆపదలమునుం

గజేతువు. అకటా నిన్ను నమ్మినవారిని వంచనజేసిపోవుట నీకు తగని కృత్యముకాదా. మహాపాపముకాదా; అగుగాక నీహృదయమట్టిది. నీచపలత్వమట్టిది. నీవు వక్రినడకల నక్షత్రముగా నవు, ఇది నీస్వభావము.

రఘునాథుడు భోరున దుఃఖించెను. తన్నుదాదూరుకొనెను. అంతయు గతజలసేతుబంధనము.

కట్టతెగి నీరుపోయినవెనుక గట్టువేయుటవంటిది. కత్తిపోటుపడిన వెనుక కవచము ధరించినటుల యిపుడేమినేయును అతనిహృదయము వజ్రముతో చీల్చినటులయ్యెను. రఘునాథుని హితులువచ్చిఓదార్చిరి. మాధవికి జరుగవలసినక్రియలు జగిరిపోయెను.

రఘునాథు డెల్లుపీడుటలేదు. భార్యావియోగము పుత్రికా వియోగమునకు తల్లడిల్లుచుండెను. మధ్యమధ్య ఉన్మాదముకూడ ప్రబలిపోవునేమోయని తోచుచుండెను. మాధవి కాలము చేసి నెలదినములయిపోయెను. నాదినములనుండియు మాలతి వర్తమాన మింతవరకు రఘునాథునకు దెలిసియుండలేదు ఉదయపురమునకు పోవలెనని యొకమారు కాల్‌దేవుని పిలిపించవలెనని మరియొకమారు తలచుచుండెను. ఇంతలో నొకపరిచారకుడు ద్వారము వద్ద నిలుచుండె

“ప్రభూ; ఉదయపురియుండి విజయవంతుని యొక్క యాశ్వికవీరుడు తమ దర్శనమునకు వేచియుండెను.

ఆపల్కులు విన్నంతనే రఘునాధుని హృదయమున నాశాలత యుద్భవించెను. వెంటనే ఆ ఆశ్వికవీరుడచటకు వచ్చి రాజా నమస్కారములు యని తాను దెచ్చినలేఖ యందించెను.

ఆలేఖను విప్పి యిట్లు చదువుకొనెను.

రఘునాధరాజా !

మా రాజచంద్రుడగు జయసేనుని వెంటనే మీపుత్రికారత్నముతో బంపించకోరుదుము. అట్లుని యిల్లరికముంచుకొనుటకు వ్యవది లేదు. రాజ్యాంగ వ్యవహారములు నిలిచిపోయునవి.

ఇట్లు

వీరమల్ల,

అని యుత్తరము చదువుకొనిన వెంటనే లేఖావాహకునికొన్నిప్రశ్నలు వైచెను. అందుకు సరియగు ప్రత్యుత్తరము రానందున నాతనిబంపివైచి తన అంతరంగికుడగు యొకమిత్రుని కాల్ దేవునొద్దకు బంపెను. రెండు దినములలో యామిత్రుడపుదెంచి మాలతి కాల్ దేవుని పరిణయమాడినటుల జెప్పెను. జయసేను కాల్ దేవుని చెరయందుండెననిగూడ వార్త విని మిగులకోపోద్దీపితుడయి వెంటనే యొకహయముపై కాల్ దేవుని జూచుటకు వెడలిపోయెను. తానొకటి దలంచిన దైవమొకటితలంచుట యిట్టిదేకదా !

న్న మహోపద్రవము గుర్తెరుంగజాలకుంటివిగాబోలు నని మలయానిలుడు పలికెను. అంతట నిద్రాదేవి రోషముతో పోరా. నన్ను తెలియక మాట్లాడుచుంటివి. నాయందే యంధకారమున్నది. నాయందే మహాజ్యోతియున్నది. నాయందే ప్రజ్ఞకలదు. నీవెంత ప్రయత్నించినను ననుగెల్చుటకు శక్తి లేదు పొమ్మ' అనెను. అంతట వాయుదేవునికి కోపమగ్గల మయ్యెను. ఒక్క పెనుగాలివీచెను. దూరమునుండి కలకలారావముతో వచ్చు మహాసైన్యముయొక్క కోలాహలమం దరిచెవులబడి దడాలున లేచుచుండిరి. వాయుదేవుడు నిద్రాదేవిని జూచి వికటముగ ఒక్కపరి నవ్వెను. పట్నము జొరబడిరి ఆమహాసైన్యమొక ప్రళయాంతకమా యనునట్లు గృహములపయిబడి అడ్డుతగులినవారిని గసిబిసంగ జేయుచుండిరి.

కొంతసైన్యము కోటకుబోయిరి. అప్రమత్తులయియున్న కావలివారలు విభ్రాంతులైపోయిరి. ఆయుధములు ముట్టటలేరు. ఒకరినొకరు బిలచుచుండిరి.

ద్వారములు దీసివేసిరి యికనేమున్నది. సైన్యముకోటయందు జొరబడెను సేవకులప్రయత్నముగ జరిగిన మహాసంకులమందు ఒకరినొకరు పొడుచుకొని ప్రాణములు గోల్పోవుచుండిరి.

ఇంతలో రఘునాథమంత్రి యిత్యాదులు భీకరముగ తుప్రప్పు నెనరొక్కనిరి. నాలుగువేల సైన్యము బల్లెములతో

అడ్డువచ్చిన ప్రతిమానవుని భీకరముగ గ్రుచ్చియెత్తుచుండిరి. రక్తప్లావితమైపోయినది. గగ్గోలుగా జరుగుచున్న మహారణమం దెవరికెవరు సహాయమొనర్చుట కెంతమాత్రము వీలుకలుగక తహతహలాడి పోవుచుండిరి. రఘునాథుడు భీకర కరవాలముతో నైదువందల సైన్యమును హతమొనర్చెను. యువరాజు నీలకంఠులను నిద్రించుచున్న వారినట్లె కట్టివైచిరి. మహారాణి ఆత్మహత్యకు బాల్పడెను. సుకేశిని వారల నూరడించుటకు బోవుచుండ నొక వీరుడామెను బట్టుకొని కాలుసేతులు బంధించి వైచెను.

పాఠకమహాశయా! ఆ మహా సయిన్యము కాల్ దేవునిది. అందరు కోయజాతి కొండవీరులు.

మహారణసమాప్తి యగుసరికి తెలతెలవారుచుండెను. రఘునాథునిశరీరము తూట్లుపడి నెత్తురు వెల్లువయై పారుచుండెను. ఇంతటి మహాఘోరము జరుగునని యెవ్వరెరుంగుదురు. ముసలముద్గర కలవారములు నుసియైపోయెను. మిగిలిన సైన్యము కోటదాటిపారిపోయిరి.

కొంతవరకు గడచినపిదప సూర్యోదయమయ్యెను. సింహపురీనగరమంతయు రక్తప్లావితమై భీభత్సత వహించెను. సూర్యభగవానుని సహస్రకిరణజాలములు భీకరగతి విడుచుచుండెను. నాడు సూర్యుని యుదయముననే చూచుటకుభీతి జనింపజేయుచుండెను.

ఆపెఱంగున జూడఁగా కాల్‌దేవుఁడు తన పరివారమును నలుదిక్కుల బల్లెములతో కాపుంచెను. చచ్చిన పీనుఁగుల కందకమున బడద్రోయించెను. సాయంతనమగునరికి కోట యెప్పటియటుల పరిశుభ్రముగఁ బునే బాగుచేసిరి.

ఆ రాత్రియెట్టి యలజడియైన పుట్టునని కోయలతివాఁగ రూకత వహించి తిరుగుచుండిరి. ఆ రేయి భిల్లనాయకుఁడగు కాల్‌దేవుఁడు నిద్రింపలేదు. ప్రతిమందిరద్వారము దృఢముగ బంధించివైచెను. తెల్లవారినది వానకోయిలకూయనికూయుచుండెను. బాలభానుఁడుదయాచల పర్వతమున నధిష్ఠించెను అంతలో కొందరు భిల్లులు కొన్ని పుష్పములు సేరితెచ్చి సభామండపమున రాసిగబోసిరి. అంతలో కొందరు భిల్లాంగనలు సవారీపై వచ్చియుండిరి. జటాధారియగు భిల్లులగురువకయోగదండమునుబూని అచటకు వచ్చెను. వాని నుచితసత్కారముల నాదరించి పురమునగల పలుర రాబనిచి కాల్‌దేవుఁడు శుభ్రవస్త్రములు రాజార్హమగు దుస్తులు కోటనుండి దెప్పించి యలంకరించుకొనెను. పురజనులు వేరు గత్యంతరములేక యచటకు మెల్లమెల్లగవచ్చి చేరిరి.

వచ్చిన పురజనుల నందరిని నాసీనుల జేసిరి.

భిల్లులగురువు కాల్‌దేవునికి శరీరము నిండ పుష్పమాలికలలంకరించి వానిని రాజ్యసింహాసనము ముందు నిలబెట్టెను

గ్రామమునుబడి కొందరు భిల్లులు పదునాలుగెనుబోతుల దె
చ్చిరి. ఆసింహాసనముముందు వాటిని ఘోరముగబలినిచ్చిరి.
ఆనెత్తుటితో సింహాసనము కడిగివైచిరి.

వేరొకచో అన్నము రాసిగబోసి దానిపై నెత్తురు
జల్లిరి. యా నెత్తుటికూటి కొండంబమువాడు నెత్తురుచేతనే తృ
ప్తి బొందును. అట్టికూటిని రాసిగజేసి కాల్ దేవుడు మరొక
యెనుబోతునుదెచ్చి మరల నరికించెను అందరు జయ కాళి
జయకాళి యని యరచిరి.

అంతట సభామండపము మరల శుభ్రపరచిరి. కాల్
దేవుడు పుష్పములచే నల్లిన కిరీటముదాల్చి యా సింహాసనము
నధిష్ఠించెను.

సుమారేనిమిదడుగుల పొడవు విశాలవృక్షస్థలముగలిగి
చూపరులకు భీతియొనరింపజేయు కాల్ దేవుడా మణిమయ
కిరీటంబధిష్ఠించెను. పురజనులు డిల్లబోయి చూచుచుండిరి.
అహా! చెట్టొకడువేయ ఫలమొకడనుభవించుననెడి సామ్యత
యింతియేగదా! యనుకొనుచుండిరి.

ఇంతలో కాల్ దేవునానతిని యొకద్వారము దెరచి రఘు
నాథుని యటకు దీసుకువచ్చిరి. రఘునాథుడు కోపారుణిత
నేత్రుడయి కట్టబడిపోవుచుండెను. ఆతనిహృదయ మగ్గిలే
కుండ భగ్గున మండిపోవుచుండెను. ఇకనేమున్నది. తన సర్వ

యూహాలు యిదివరలో నే తెగిపోవుచుండెను, అవమానదుః ఖముచే కుమిలిపోవుచుండెను. ఇదు రాత్మ్కన కేశికుతప్పగాద నికొందరు, పిట్టపిట్టపోరు పిల్లిదీర్చెనని కొందరు వలువిధముల గుసగుసలాడుచుండిరి. జటధారి సద్దుణగ జేసెను.

అంతట కాల్ దేవుడు మంత్రివంకజూచి చిరునగవుతో (మహామంత్రి శేఖరా! నీ గర్వ ప్రాయచిత్తమైపోయినది. నేటి నుండి సింహపురీనగరమునకు నేనేచక్రవర్తిని. నీవునాకు ఖయిదీవయితివి. నిజమేనా;, అనెను.

మంత్రి—ఛీ. ఛీ. కపటవర్తనా. కుటిల హృదయా. మొకటు మెచ్చిమో యిచ్చకముల నచ్చబలికి తుదకు ఘాతుకమొనర్చితివి. నిన్ను ఖండ ఖండలుగ ఖండించినను పాపము రాదు.

కాల్—అగును. మామా నీకుమార్తె నన్ను వరించి పరిణయము గావించుకొన్నది. జయసేనుడు నాకారాగారమం దున్నవాడు. నిన్ను కఠినముగ నఱిదీయించుట కర్తవ్యముగాని నాకు మామవైనందున్క నీయావజ్జీవము నా కారాగారముః౦ దుకృశింతువుగాక పొమ్ము.

సింహబలాయని పిలచెను. వెంటనే యొకదీర్ఘకాయుడు కాల్ దేవునికి వందనమర్పించి ఎదుట నిలచెను.

కాల్ — ఈ మహామంత్రి — కామ = రాజు — గారిని మన ........జన్మపర్యంతము ఉంచుము పొమ్ము.

చిత్తమని సింహబలుడు వెడలిపోయెను.

యువరాజుకొరకు వెదకిరి. యువరాజుగాని, మహారాణి గాని ఎంత వెదకినను గాన్పించనందుకు కాల్ దేవుని హృదయము ముగగ్గోలుపొందెను. యువరాజు నారిదీయించుటకు కాల్ దేవుడు తలచెను. దానికి భిన్నముగ జరిగిపోయెను. సింహపురీ యొడయుడు కాల్ దేవుడై పోయెను. అంతయు ఈశ్వరచిత్రము.





# హారతి



## పదునేడవ ప్రకరణము.

### పాపఫలము.

అతి హిమవంతఋతువు. కొండగాలి రివ్వురివ్వున వీచుచులోకమును గడగడ వడంకచేయుచుండెను. ఆ చలిబాధనోర్చుట యెవ్వరితరము. భాగ్యవంతులు యున్నిశాలువులు గప్పుకుందురు. పాపము నిరుపేదలు తమ గుప్పిడులముగిడ్చి యేమరిప్రమాటుననో గడగడవడంకు చుందురు. పాపము [illegible]రికి నెగదు[illegible] గతిలేకుండబోవును. అట్టి నిరుపేదలను కట్టబట్టపొట్టకు [illegible]డిలేని[illegible]రలాదరించు పుణ్యాత్ములు గలుగుటరుదు. అట్టివారిని పరాత్పరుడేసర్వవిధములజూచుటకు ముఖ్యకారకుడు

తాం[illegible] మరొండుజీవి జేతులకలుగు[illegible] దుర్భరము. హోరునవర్షము వర్షించుచుండ గడగడ చలికి వడంకుచుండి భీకరముగ ఎండలుగాయుచుండ త్రికాలములకు తలయొగ్గి తమ పూర్వ

పుణ్యఫలమును దూషించు క్షుద్రజీవి కింగంజ కనికరమున బోయగల పుణ్యాత్ముడేడి. ఇటులనే కాలము తరలిపోవు చుండును.

పూర్వపుణ్య సంచిత పాపఫలమే ప్రజలను బాధింపు చుండును. ధనవంతుడైన దుర్నీతిపరుడెంతటి యిడుములబొం దుచుండునో అందుకు వ్యతిరిక్తముగ నిరుపేదయైన సద్గుణుడు బొందజాలడుగదా !

కాలముమీరివచ్చినపుడు తన పాపఫల మనుభవించ వలసిన తరుణమబ్బినపుడు మహారాజయిననేమి, నిరుపేదయై ననేమి. తప్పక కష్టము బొందవలసినదే. కష్టమందరికొక్కటియే సుఖముమాత్రమట్టుల కాదను నాకోక్తి రిత్త కాదు. ఎంతటి చక్రవర్తియైనను కాలము నెదిరింపజాలడు కదా.

ఉదయపురి చక్రవర్తి సకల సౌభాగ్య యుక్తుడు ధీశాలి అయియుండియు రావణునివలె స్త్రీలపాలిటి యముడై జారుడగుటచేతనేగదా తనకన్న హీనుడగు నొకభిల్లునకు ఖైదీ యైపోయెను. చూడుడు. కాలమెంత వక్రబుద్ధి కలిగినదో! గోజుకొక్క పూటయైనను కడుపార దిండికికరువై పోయివాపో వుచుండెను. అకనుమల మధ్యగల నొక లోయగుడ పది యోజనములు పోయిన ఆరావళీపర్వత మొదటి పర్వత ప్రాంత మునకు బోవును. అదియొక భీకరమగు ప్రదేశము ఆ [illegible]

సుమారు నాలుగైదుక్రోసుల వైశాల్యముగలదియైయుండెను. దానినే పాందీయని ఇటీవలవాడుచుండిరి. అందొక విశాలయుక్షతగృహముగలదు. దానియందు యొక గూఢమగు గదియందు నిద్రాహారములులేక కృశించిపోవు జయసేనుడు తన పరిస్థితికి మిగుల వగచుచుండెను. ఆతని హృదయమునవగి పుటమేసినటుల భగ్గున మండిపోవుచుండెను. అగాధమగు మందిరమునుండి వెడలుటకించుకంతయిన దారి యగుపడుటలేదు. నిశ్శబ్దము వజ్రపు తునుకలవంటి పదునార్గురు భిల్లులు కాపలా కాయుచుండిరి. మూడువేల సంఖ్యగల వీరవిహారము సల్పుటకు తగు పరిదేశమున భిల్లులయ్యును ఇతరులెవ్వరయిన తమ నెమ్మదికి భంగపాటొనరింపకుండుటకయి రాజకోటవలె కట్టుబాటులు గావించుకొనియుండిరి. వారియునికింతవరకెవ్వరికిని సంపూర్ణముగా దెలిసియుండలేదు. కారణమూ కొండకనుమలమధ్య విహారముగా సంచరించుటయే.

ఆ భిల్లరాజ్యమును లీల కాల్ దేవుడు పరిపాలించుచుండెను. కాల్ దేవుని యాజ్ఞలేనిదే ఎవ్వరును నేపనియు జేయ వెరతురు. వారికేలిక కాల్ దేవుడు. సింహపురియందు గలిగిన ధనాపహరణము కాల్ దేవుని సహాయము వలన జరిగియుండెనని యిదివరకే పాఠకులకు దెలిపిన విషయమే. సైన్యమేగాక [illegible] రఘునాథసింహుని కృపవలన ధనాగారముకూడ [illegible]రిన

తోడనే కాల్‌దేవుడు విర్రవీగిపోయెను. ఎంతకాలమునుండి యో పరులకు కంటకములు గల్గింపకుండ ఆకలములుదిని మ్రొగ్గులు వేటాడుకొనుచుండు భిల్లులకు ధనాశా దేవత వారికన్నులు గప్పి తుదకు కుటిలహృదయుడగు కాల్‌దేవుడు నమ్మిన రఘునాథు నక్రమముగ చెరబెట్టి వానిహస్తమునగల రాజ్య చక్రమువలీల కాల్‌దేవుడు హస్తగత మొనర్చుకొనెనుగదా! ధనమేమి చేయింపదు. కాంతాకనకములవయి నాశలేనివాడు వృద్ధిలేనివాడని చెప్పునటుల కాల్‌దేవునికి ధనము చేకూరెను. అప్రయత్నముగ మాలతిని బట్టనెంచి యామెను బలవంతము మీద పరిణయమాడుటకు ప్రయత్నించెను. రఘునాథునిమోసగించి జయసేనుని బంధించి మాలతిని తాను బడయుటకెంతయో యత్నముచేసెను. నేడు మాలతియు కాల్‌దేవుని చెర బడిపోయెనుగదా.

జయసేనుడుగూడ చెరయందుండి పలువిధముల దుఃఖించుచుండెను. మాలతిని వేరొకగృహమున దాచివైచిరి. జయసేన మాలతుల దుఃఖమొకటియైపోయెను.

జయసేనుడు మోసపోవుట మాలతి దర్శనభాగ్యమబ్బకపోవుటయు అను రెండు సమస్యలయందు బడిపోయెను.

ఇక మాలతియో అట్లుగాదు. ఆమె దీర్ఘమగు విచారమున గృంగిపోవుటలేదు. అబలయయ్యు తన మానసంరక్షణ

మొనర్చుకొనగల శక్తి యామెయం దుండకపోలేదు. యందు ననే యామెకొంత ధైర్యమువహించి యుండెనని మనము చెప్పగలుగుచున్నాము. అశోకవనమున సీతామహాతల్లి రక్కసులమధ్య విచారించలేదా. అటులనే మన సౌజన్య–సుశీల యగు మాలతి భిల్లాంగనల దుర్భర దుస్సర కఠోరవాక్కుల చెవియొగ్గి వినుటకెంతయో గుందుచుండెనని చెప్పుదుము.

నలువైపుల భీకరమగు పర్వతములచే పరివేష్టింపబడిన యొక చక్కని సరోవరము నిర్మల స్వచ్ఛందజలములతో తుల తూగుచు గట్టుల నొరయుచుండెను.

ఆసరోవరముమధ్య సహస్ర కమలమువికసించి తన నిజసౌందర్యముచే మిలమిల మెరసిపోవుచుండెను.

ఆసరోవరముగాని ఆపర్వతంబులుగాని జడపదార్థములే కమలము జడపదార్థమైనను చలనపదార్థమై బొడకట్టకమానదు. అట్టిదివ్యపద్మ సౌరభసౌందర్యము కనులారజూచి యెవ్వడానందించగలడు. ఎవ్వఘ్రాణించగలడు. ఎవ్వడు మోదమొందగలడు.

అయ్యది లభ్యపదార్థమైపోవుచున్నది. నిజ సౌందర్యము వెల్లిపిరియులకు తావులేదు.

పరుషపడచొచ్చుటికి బోనెంతమాలతియు వలనుపడకుండెను. ఇంక నాకమలముయొక్క శృంగారమేల? మాధుర్య

మేల? కొద్దికాలమువరకటులనే నిలచి తుదకు కృశించి, కృశించి వాడి శతపత్రములోని పెనుగాలికి శతవిధంబుల తూలి యా జలముపైబడి యేపిరోయొక లోయుంబడి పోవలసినదేగదా!

అట్టులయ్యేగదా తన జీవనమని మాలతి నొక్కొక్కప్పుడు సంతతధారగా నశ్రుజలంబులు విడుచుచుండును.

తన వ్రేలినున్న ముద్దుటుంగరము విలకించి 'వసంత' యని యాక్షరములం జదివి ఎన్నటికయిన వసంతునిజూచు మహాభాగ్యముపట్టుట దుర్లభమని శతవిధముల దుఃఖింపుచుండెను ఇంటిలో రఘునాధుని నలువురు భిల్లులుగొనితెచ్చి యొకమందిరమున బంధించిరనికూడ మాలతివిని యూరకుండెను. ఇక నీజన్మమున తన తండ్రిమోము జూడరాదని నిశ్చయమొనర్చుకొనెను.

జనని కాలగతిజెందెనని యామెకెవ్వరివలనను దెలియబడలేదు. గోరుచుట్టుపై రోకటిపోటనునటుల జననిమరణము దెలిసియుండిన నిక మాలతి విచారభారము దిప్పుట కెవ్వరికయిన దరమా !





# మాలతి



## పదునెనిమిదవ ప్రకరణము.

### ముప్వరాశ్వికులు.

పూర్వము ప్రపంచములోని వార్తల నొక రాజ్యము నుండి మరియొక రాజ్యమునకు దెలియుటకు కొందరు బేగిరావులుండెడివారు. ఇప్పటివలె తంతిమార్గములుగాని టపామార్గములుగాని యుండెడివికావు. ఎంతదూరదేశమైనను కాలినడకనుగాని అశ్వారోహణమొనర్చిగాని పోవుచుండెడివారు. అట్టి బేగిరావులే చరిత్రవర్తులను సహస్రనేత్రములయి యుండుటచే తప్రజాకష్టముల గుర్తెరింగి సన్మార్గుడయిన ప్రభుడాకష్టజాలముల నెదుర్కొని సహాయమొనర్చుచుండెడివారలు. సింహపురీనగరము అల్లకల్లోలములకు బాల్పడెనని రక్తపాతమయ్యెనని యితర రాజుల కదరకు దెలిసిపోయెను. మంత్రి కపటకృత్యమెల్లరకు దెలిసియుండుటచే ఎవరిమంత్రుల వారలతిజాగరూకతతో నడుపుకొనుచుండిరి.

ఒకనాటి యుదయమగునరికొక యాశ్వికుడుదయపుర ముజేరి యొకతమ్మి సనత్కుమారుని కందించెను. సనత్కుమారుడు తిమ్మరసువంటి యుక్తిపరుడు. చాణుక్యునివంటి నీతిపరుడు దుర్గాదాసువంటి పట్టుదలగలవాడు. నాటి యాశ్వికుడందించిన లేఖంజదువుకొనినవాడయి వెంటనే మరియొక యోధునింటికి జని వానినిగూడ బిలిపించుకొని తనరాజ్య పల్లకల్లోలము జరుగకుండుటకయి కట్టుబాటుల నొనర్చి నూతనవిరునితో ముప్పురును అశ్వములపై నధిష్ఠించి వెడలిపోయిరి.

జయసేనుని యువస్థవిసి ప్రజలందరు జయసేనచే నియమింపబడిన మంత్రిని తమబలముచే నోడెముద్దుకొని తిరిగి యాపదవికి సనత్కుమారుని ప్రజలే నియమించిరి. తత్కారణమున కొన్నిమాసములనుండి సనత్కుమారుడు మంత్రిపదవి చేకొని మరల తన రాజ్యమునకు తగునటులుపకారములుజేయుచునెట్టియలజడియు బుట్టకుండ నెమ్మదిగ కాలముబుచ్చుచు రాజభక్తిపారీణుడగుటచే తన భక్తిని తన హృదయమునందే పరిపాలింపజేయుచు నెన్నటికయిన తనయొడయుని సన్మార్గగామిగా జేయుతలంపున దినములు లెక్కించుచుండెను.

ఇంతవరకు తమజేని యాగడదెలియక పలుతావుల పంపుర భటులనంపి వరయుచునేయుండెను. నేటియుదయమున సింధుమాల నగరపురాజు తన మిత్రుడగుటంజేసి యాతనిచే

నొకభటుని బంపబడి తమరాజునికి దెలియగలిగినందుకు కందళిత హృదయారవిందుడగుచు నేడు బయలువెడలెను. నాటి సూర్యతాపము బహు తీవ్రతగనుండెను. చల్లనిగాలి మధ్య మధ్య వీచుటచే నంత తాపము శ్రమయని తోచుటలేదు.

ముప్వురాశ్వికయోధులు సింధుమాలనగరమున కవ్వలిగల వనంబునంబడిపోవుచుండిరి. మొదటియాశ్వికుడిరువురకు మార్గము జూపువాడై ముందుబోవుచుండెను. వాని వెనుక సనత్కుమారుడును, ఆ వెనుక నూతనవ్యక్తి సనత్కుమారునితో సంభాషించుచు బోవుచుండెను. సాయంకాలమగుచున్నకొలది వారివారువములతివేగముతో బరువెత్తించుచుండిరి. ఎట్టకేలకు వారు ఆరావళీ పర్వతప్రాంతము జేరునరికి పూర్తిగ నస్తమించెను. కొండగాలి రివ్వున వీచుచుండెను. కొండలపై బూసిన పుష్పములు మదువువాసనలో గొన్నియు, సుగంధ పరిమళముతో గొన్నియు గంధవాహునితో మిళితమయి హృదయానందము గూర్చుచుండెను.

ముప్వురాశ్వికులొక వాగువద్ద తమవారువముల దిగిరి. వారదివరకు దెచ్చుకొనియుండిన ఫలహారము లావాగువద్ద భుజించిరి. ఇంతలో తమ గుర్రములనచటగల పచ్చని మేతకై విడచివైచిరి. వారి ఫలహారములు పూర్తియయినపిమ్మట తిరిగి వారశ్వారూఢులయి బయలువెడలిరి.

హృదయములు విదారితమగునవుడేమి యింపుగదో? చున్న; అంతయు గాఢాంధకారము, ఆకొండలనడుమగల సన్నని త్రోవవెంట తమ గుఱ్ఱములను మెల్లగ నడిపించుచుండిరి. సింహశార్దూలమృగములు తమపొదలనుండి గర్జించుచుండెను జంబుకములూళబెట్టుచుండెను. సాధుమృగముల జంపనెంచి యొక సింధువ వారివెనుకతట్టునుండి పరుగెత్తెను. అడవిపంది గుఱ్ఱపు సకిలింపునకు బెదరి చెంగున ముందు పరుగెత్తెను. అడవి మార్జాలములు కొండయెలుకలను బట్టుటకు కొండలపై కెగ బ్రాకుచుండెను. ఇంతలో నొకదుప్పులమంద తమశక్తి కొలది పరుగెత్తుచుండెను. వాటనొక శార్దూలము భీకరముగ తరుముకొనిపోవుచుండుట వారుజూచిరి. సనత్కుమారుడూరక చూడజాలక నొక్కబాణము వింటసంధించి విడచెను. ఆదెబ్బకాపులి గాండ్రుమని భీకరముగ నడవి ప్రతిధ్వనింపజేయుచు వారిపై బడెను. అంత నాశ్వికయోధుడా పులిని విచిత్రముగ దప్పుకొనెను. మధ్యపులియు చుట్టు నామువ్వురుయోధులు యొక హస్తమున తమగుఱ్ఱముల కళ్ళెములబట్టి రెండవచేతితో కత్తులదిప్పుచుండిరి. సమయముమొసంగి నూతనుడాపులిని నొక్కపోటుబొడచెను. వెంటనే యది గాండ్రించుచు బుడమిపైబడి పోయెను. తిరిగి మువ్వురు నడలుచుండిరి. వారికడ్డముగ కొన్ని శశములు పోవుచుండెను. వాటినేమియు వారుచేయకయే పోవుచుండిరి.

చెంగుచెంగున నెగురు కురంగములజూచిరి. ఏదుపందులదిలకించిరి. పెద్ద ముండ్లడొంకలవలె జూపట్టు నెలుంగులగుంపును జూచియుండిరి. ఆయెలుంగులు ముందుదారి వెనుకదారి నరయక యే యిటునటు చెదరుచు చెట్లపొదళ్ళ జొచ్చి జొచ్చుచు మరల జేరుకొనుచుండెను.

ఎంతక్రూరమృగమైన నొకటి తటస్థించినంతనే హృదయము గగ్గోలుచెందునుగదా! అట్టిదొక గుంపువచ్చుటజూచినవెంటనే వారిగుండెదడబుట్టెను. అప్పుడే సప్తమీచంద్రుడుదయించుచుండెను. నెలవంక వెలుంగు సన్నసన్నగ కొండశిఖరముమాటునుంచి దాగుడుమూతలాడుచున్నటులుండెను.

రానురాను నెలుంగులగుంపు దరికిజేరుచుండెను. ఎదుటనఠాత్తుగ నిలచిపోయెను. ముందున్న యాత్రికుడు తటాలున తనజేబునుండి యగ్గిపాయితో నిప్పుముట్టించి క్షణములో నడుమునను చుట్టబడిన నొక పెద్దవస్త్రమునంటించెను. దాని వెలుంగున మృగజాలక భీతులయి ఇటునటు పరెత్తిబోయెను. కొంతమార్గమేర్పడినంతనే వారలాయాపద సునాయాసముగ దాటుదు రామండుచున్న వస్త్రమొక యెలుంగుపై విసరివైచెను. అయ్యది దానిమెడకు జుట్టినట్లు ముడివడి మండుచుండెను. ఇక నచటొకటియైన నిలువక తమ యిచ్చవచ్చినట్లు చెట్లచేతులనెక్కుచు చెల్లాచెదరయి పారిపోయెను. ఇంకను వారుజేరవలసిన గమ్యస్థానము చేరలేదు. కొంతదూరము

[illegible] ఖండ్రదర్శనము చక్కగ గాన్పించుచుండెను. బాట మీఁద కొంతవలిగినదై యుండుటచే వారి యాశ్వము లతిత్వరితగతి బోవుచుండెను. ఒక మఱ్ఱివృక్షమువయి కాకులు కావుకావుమని భీకరముగ గోలబెట్టుచుండెను. అయ్యది యెట్టిదో యని వారచట నిలుచుండి జూచుచుండిరి.

తమ శత్రువులయిన దివాంధములు—నిశాచరులు కాకిపిల్లలు[illegible]కొని తినుచుండెను. వాటి శత్రుత్వమివ్విధంబున [illegible]చి వారు ముఁవ్వురాశ్చర్యచకితులయిరి.

కౌరవ వధానంతరమున నిట్టి సామ్యతయేగదా అశ్వద్ధామ, కృతవర్మ కృపాచార్యులకులు జూచి నాచరించినది.

ఇది కౌరవవధగాదు. కాని అంతటి పరాక్రమము జూపవలసిన తరుణము మాత్రమైయున్నది. వారి మువ్వురువలె నింతవరకు నీముువ్వురు అట్టిదృశ్యమును జూచుటచే మలేఖనని కాభారతపాఠ్యము తలంపునకు వచ్చెను. అది యుద్ధానంతరము ఇయ్యది యుద్ధపూర్వమే. ఆ నాడు పోను పోను [illegible] [illegible]యామము దాటుచుండెను. అచటగలవృక్షములపై తమ [illegible]ముల గట్టివైచిరి. సనత్కుమారుడును నూతన[illegible]త్రము సింధుమాలనగరమునుంచి వచ్చిన వారు [illegible] ఇరువురు నాయుధములు గుప్తపరచి కూతవేటుదూ[illegible] దాటి క్రిందపల్లవుచరియకు బోవుచుండిరి.

వారు పోను పోను భిల్లులకుగల రహస్యాగారములవద్ద కేవారుపోయిరి. వారిముఖముపై గుడ్డలను గప్పుకొని యొక గృహమునుండి మఱియొక గృహమునకు అనగా పూరిగుడిసెల దూరుచు పోవుచుండిరి.

ఇంతలో నొక పాడుదేవళమునుండి ఘంటారావము వినవచ్చెను. వారిగుండెలు ఝల్లుమనిపోయెను. ఇంకేమున్నది. ఏకార్యముకొరకయి నిలువెడలియుండిరో—ఏ మహోపకారము తమపై నిడుకొని వెడలుచుండిరో—అయ్యది వారుచేరకముందే పరిసమాప్తి యగుచుండెనా. అకటా కొండలనక గుట్లలనక ఇంచుకైన శ్రమను లెక్కచేయక నాలుగహోరాత్రములు ప్రయాసతో పయనముచేసినదెందుకు. ఈజరుగనున్న మహాకాలమునకే—ఈభీభత్సదారుణసంఘట్టనముమాన్పుటకొరకే. ఏమో, అప్పుడే ఘంటారావము వినవచ్చెను. ఇంకెంతకాలము. ఇంకెంతకాలమో వ్యవధిలేదుకదా;

ఓపావపుదైవమా! ఆశ్రితులశ్రమవాపి సుఖమును నానందమును కలుగజేయవా—వారిశ్రమలకు దగిన సఫలమును జేకూర్చవా. అకటా ఏమో నీలీలలద్భుతములు, అనంతములు సర్వలయకారణుడవు. ఎవ్వరెరుంగనేర్తురు. సర్వప్రాణుల సుఖదుఃఖ మూలకారణుడగు శ్రీమన్నారాయణా మా యువకులు నీపై తమభారములువైచి ఎదురుచూచుచున్నారుగదా. వారికానందమొనగూర్చినను పరిభవమొనగూర్చిననూ నీవేమూలకారణుడవగుదువులెమ్ము.



# మాలతి

## పందొమ్మిదవ ప్రకరణము.

### దుఃఖములో ఆనందము.

నాటిరాత్రి రెండుజాముల కాలమతిక్రమించెను. భిల్లవాటికయంతయు నింకను నిద్రబొందలేదు. అచట చేరిన సారమేయములు అన్యోన్య స్వజాతివిరోధంబున కొంత కలహము పెంచుకొనుచుండెను. కొందరు భిల్లులు నిద్రాముద్రితులయి యుండిరి. కొందరుమాత్రము నిద్రబోలేదు. వారు తలంచిన కార్యమును తుదముట్టినంతవఱకు వారికి నిద్దురబట్టదు. భిల్లవాటికకు కొంతదూరమున నొక పాతదేవళంబుగలదు. ఆదేవళంబున కాళికావిగ్రహముంచి నిత్యము నద్దేవిని బూజించుచుండురు. కాళిక వారికోరికలనెల్ల దీర్చి ముదమొసంగునని వారినమ్మిక.

నాటిరాత్రి యొక యఖండము వెలిగించి దేవి సాష్టాంగ ప్రణామంబుచేసిరి. నలుగురు భిల్లులుమాత్ర మా దేవిమందిర మందు గూర్చుండియుండిరి. ఒకని కరమందు భీకరకరవాల ముండెను. ఒకనిచేతులయందు వసువు వేవర్గొట్ట యుండెను. మరియిరువురు తాళ్ళు తమ వద్దనుంచుకొని కునుకుచుండిరి.

ఇంతలో నిరువురుస్త్రీలొక యువతీలలామ నచ్చోటకు గొనివచ్చిరి. పావమాయువతి మిగులవాపోవుచుండెను. శిరీష కుసుమపేశలమగు నాయింతి తామరతూడువలె వ్రేలాడి వసివాడిపోయియుండెను. ఆమెనుకుమారకరములు మోటుభిల్లాంగనల కరములపట్టుచే నెర్రగకందిపోయెను. తల్పకంబళముపై నడచు యాలేమ కంటకశిలానిర్మిత పర్వతప్రదేశమున నడువవలసివచ్చెనుగదా.

యామందయాన మందనుండి వెలువడిన గొర్రవతెరోదన మొనర్చుచుండెను. కేశములకిదివరకే తైలసంస్కారరహితమైనందున జటలుగట్టి వ్రేలాడుచుండెను. ఆమెహృదయము తీక్ష్ణతరమైపోయెను. ఆమె దేవివిగ్రమును జూచెను. నాటి దేవిమూర్తి భీకరమై బొడగట్టెను. ఎన్నిరోమా కొండపూలచే దేవినలంకరించియుండిరి. సుందరి యాభీకరదృశ్యమును జూడజాలక 'హా! దైవమా' యని మూర్ఛబోయెను. వెంటనే భిల్లాంగనలు అర్ధచేతనమతిపై యామె ముఖమున

కుంకుమనలందిరి. ఆమెశరీరమంతయు వచ్చని వసువుచేపూయు చుండిరి. కొంతవరకు గడుచునరి కాయింతికిమెలుకువఘనించెను.

అంతలో ఖడ్గముచేబూనిన భిల్లవీరుడా యింతినిజూచి ,ఓసుందరీ ! నేటితో నీయాయువు సరిపోవుచున్నది. మా దేవి కోరుటచే అప్రయత్నముగ నీవుమాకంటికగవడితివి. మాఏలిక కాల్దేవుడు నిన్ను దేవికిబలినీయవలసినదని యాజ్ఞయిడెను గావున నీ యిష్టదైవమును ప్రార్థించుకొమ్ము' అని పల్కెను.

పాపమాబాలిక నోరెండుకొనిపోయెను. శరీరమంతయు చెమటలు గ్రమ్మెను. దుఃఖము, రోషము ముప్పిరిగొని వచ్చు చుండెను. అయినను తానొక్కరుతె. వెంటనే ఆ యింతి— ,ఓ భిల్లనాయకా ! నీకువందనములు. ప్రపంచమునందు నేనొక యభాగ్యను. కావుననే మీదేవి నాయసువుల కోరుచున్నది. నేను ప్రాణమునకంత లక్ష్యముచేయను. ఈప్రాణి యెన్నటికైనను పోవలశినదే. కాలము తీరినవరకెవ్వరును పుడమిపై బ్రతికియుండరుగదా ! అయినను నాముఖ్యురాలగు చెలి ప్రాణము గాపాడజాలకపోతినని విచారించుచుంటిని నా చెలి నిచటనుండి వేరుచేయు నుద్దేశ్యముక్కు భగవంతుడు ప్రతికూలుడై పోయెను పాపాత్ముదాలికి పరమేశ్వరుకుగాని మనుష్యమాతృకు గాని కాలము—కర్మము మూడినపుడనుకూలుండెట్లగు. తండ్రీ! సర్వ సిద్దముగనుంటిని, నీకత్తిచే నాశిరస్సు నాదేవికి బలిపెట్టుము' అని బద్ధాంజలియై దేవివిగ్రహము దిలకించి ముకుళితకరకమల యై తనలో ,తల్లీ! జగన్మాత, నిన్ను కోరివేడినవారి కఖండ

అయిశ్వర్యము లొనరింతువనియు దీర్ఘాయుష్మ లగుదువనియు పెద్దలవాక్కులు వృథచేయుదువా ! జననీ; నీకేయితరచింతలు హృదయంబున గలిగియుండలేదు కాని, నే పుట్టిన కొన్నిదినములకే నాజనని కాలధర్మమొందుటయు, తదుపరి నాజనకుడు దేశాంతరగతుడగుటయు, వృద్ధుడగు పితామహుడు డకారణముగ జయసేనునికి బందీయగుటయు నాకష్టముల నేను ఎదుర్కొని నాచెలియగు మాలతికిని మహారాణికిని నమ్మకముగ నెచ్చలినై పొట్టబోసుకొనుచుంటిని. ఎన్నటికైనను నా వృద్ధ పితామహుని జూచుటగల్గునని గంపెడాశతో నసువుల బిగబట్టుకొని యున్నదాననుగదా! మరియు మాలతి విముక్తై యిచటకు చేరిన వెంటనే నన్నాకారణముగ కాల్దేవుడు పట్టి బంధించి నేడు నీ—మతమున నాకొన్నిరు భూమిపై బడజేయుచుండెనుగా.

తల్లీ, నన్ను రక్షింపకుండినను సరియె. నాకున్న రెండుకోర్కెల దీర్చుట నీకంత కష్టతరమా;' అని తన పితామహుని దలంచిన వెంటనే కన్నీరు మున్నీరై కాలువవలె గారజొచ్చెను. ఇక నేమున్నది.

ఇంతలో దేవీపూజారి ,,ఓసుందరీ: నీ ప్రార్థన పూర్తియైనదా!' అనెను. వెంటనే యువతి తలపైకెత్తి ,,గంభీరస్వరముతో ,సర్వసిద్ధమై యున్నాను' అనెను. భిల్లవీరుడు ఖడ్గము పైకెత్తెను. ఒక్కవ్రేటు, ఈవ్రేటుతో యామె శిరస్సు మొండెమునుండి వేరుగావలసినదే. అంతలో అర్యకుడు అగుమాగు

మని యొక దండ యామెకంఠమున బడవైచెను. ఆమె కాళ్ళ సంకెలలు విప్పివైచెను. బలిపశువునకు బంధన ముండకూడదని వారియుద్దేశ్యము. వెంటనే ద్వారముకడనిలుచున్న యిరువురు భిల్లులలోనికి రమ్మని బిలచెను. భిల్లాంగనలు వెడలిపోయిరి. ద్వారము బంధింపబడక దగ్గరకు చేర్చియుండిరి. ఒక చిన్నగడియ మాత్రమూరక తగిలించిరి. భిల్లవీరుడు మరల కత్తినెత్తెను. అంతలో మిగిలిన ముప్వురు జయ దుర్గ, జయ దుర్గ అని యరచిరి. ఇకనేమున్నది తటాలున నవకుమారుడు మరి యొకవీరుడా తలుపునందునుండి చూచిరి. భిల్లవీరుడెత్తిన ఖడ్గమట్లుండగనే ఫడేలున తలుపుతన్ని త్రోసుకొని నవకుమారుడు లోన ప్రవేశించెను. నూతనవీరుడు భిల్లునికరమట్టె వరికివైచెను. ఇకనేమున్నది. మిగిలినముప్వురు నవకుమారు నిపై బడిరి. భిల్లవీరుడా కత్తినెత్తి యెడమ హస్తమున నూతన వీరునితో దలపడెను.

పోరు ఘోరముగనుండెను. తటాలుననాయింతి నూత నవీరునిజూచి యొక ప్రక్క కానుకొనెను. ద్వారమందున్న భిల్లుడొకడావలకు పరువిడి భిల్లవాటికనంతయు గగ్గోలుచేసెను ఇంతలో భిల్లపల్లెయందుండిన వందమంది యోధులు తమబల్లె ములదాల్చి దుర్గగుడిని చేరిరి. ఇంతలో యా యింతి అచట పడియున్న యొక పెద్దకరవాలమందుకొని దుర్గ కృపకు వందన మాచరించి నూతన వీరులకు సహాయయై నిలుచుండెను.

ముర్వ్వారాగుడినుండి యీవలకు వచ్చిరి. అచ్చట భిల్లులతో సంకులసమరమొనర్చిరి. సూర్యగురుయోధులలో కొక్కరు మాత్రము కొందరు మిగిలిరి. వారలు తమ శిక్షాబలముక బలాయనమొనరించిరి.

వారలిరువు రా యింతితో గొంతదూరము పోయి యాయింతినిగూర్చి 'అమ్మా! నీవీదురాత్ముల కెలచిక్కితి' వని ప్రశ్నించెను.

తండ్రీ: ఎందులకు నన్నిట్లు బ్రశ్నింతురు. నేనొక అభాగ్యను. నారాయణసింహుని మనుమరాలిని, నన్ను చంద్రావతి యందురు. ఆపలుకులు వినినవెంటనే సనత్కుమారుడు పులకాంకితదేహుడయి అమ్మాయి నీవు నాకు సోదరివంటిదానవు. నీ పితామహుని ప్రాణముతో నీకు జూపెదనులెమ్ము.

మాణయసేనునిసంగతి నీకేమైన దెలిసియుండిన వచింపుము.

అయ్యా, ఆదురాత్ముని మూలముననే మాకిన్నిపాట్లు సంభవించెను.

,,అగును. ఆభయమికవలదు. దెలిసియుండిన దెలుపుము.

,,అజయసేనుని నిన్నటిరేయి ఖండించి యీ దుర్గగుడి ప్రక్కనే పూడ్చిరని వినయుంటిని.

సనత్కుమారుని గుండె నీరై పోయెను. తమ ప్రయత్నము నిష్ఫలమయినదని నిట్టూర్పువిడచిరి.

వెంటనే ముగ్గురు దుర్గాలయము వెనుక భాగమున త్రవ్వించిరి. అచ్చట కుళ్ళిన శరీరముండెను. వారు చాలవిచారించిరి. దైవమునుదూరిరి. యీ సందర్భములో యీ యింతి నూతనయువకునొకటి రెండుపర్యాయములు జూచెను. అతడు గూడ నామెయందమును గ్రోలుచుండెను.

పిదప వారు ముగ్గురును నచటనుండి వెడలిపోయిరి.

ఓ భగవానుడా ! నీచర్యలద్భుతములే, అనంతములే. ఇదమిద్ధమని నిరూపించి వచింపజాలముకదా. ఒకగడియక్రింద ప్రాణములపై నాశనుత్యజించియున్న యువతిని మన్నించితివి. తలవని తలంపున ననేకులు తమ ప్రాణములు వీడియుండిరి. దురాత్ముడగు జయసేనుని వారిదివరకే గూఢముగ జంపియుండిరి. పాపము ఒక సంవత్సరమునుండి ఖైదీగానుండిన జయసేనుని మరణమట లిఖించెనుగాబోలు కదా—

# మా ల

## ఇరువదవ ప్రకరణము.

### చిరకాలదృశ్యము.

అకటా కుటిచికూర్చుండలేక హృదయమంతయు యగ్గినేల ప్రజ్వలింపజేసుకొంటిని. దుర్మార్గుడనై కోరివిచే తలగోకికొను నటుల కాల్దేవుని సహాయమేలబడసియుంటిని. యురికిబోధ నాకపారణముగావించి కాల్దేవుని స్వాధీనపర్చి ఎంతటిముప్పు దెచ్చుకొంటిని. రాజ్యమల్లకల్లోలము పాలుగావించితి. ఇష్టము లేనివరునిగూర్చగర్భవాసముందుద్భవించిన పుత్రికామణికెంతటి మనఃక్లేశము నొనర్పజేసితి. సుగుణమణియగునిల్లాలిని చేతులా రజంపుకొంటిని. కాలమా! నీవెంతటికైన తగుదువు. నాచేతు లార భగవానుడీ ఘోరకృత్యములు జేయించెనుగదా! రాజ్య కాంత ఎంతనిచేయించదు. ఛీ! ఛీ! ఓరఘునాథా! రఘునాథా! నీవన్నిటికి జెడియుంటివి. కుక్కమూతి పిందివైపోయితివి. నీజ న్మనిరర్థకము. యువరాజునుగాని అన్యునివరింపననెడి కుమా రైను దుఃఖములపాలుగావించితివి. రాజ్యమందొక రాగిపైస యైనను మిగులకుండ దుర్మార్గుడగు కాల్దేవుని చేతనిడితివి. రాజ్యముకారణముగ భిల్లునిచేతబడిపోయెను. జయసేనునన్యా యముగ ఖండించివైచిరి. నిద్రాహారములకెడమై నేనిటుల కద

లుటకుగాని, మెదలుటకుగాని వీలుకాని సంకటముల పాల్ప డిపోతిని. కుమార్తె సౌదామిని ఎచటనుండెనో దెలియకుండెను.

కానిమ్ము ఓసుగాత్మా! కాల్ దేవా! నిన్ను ముక్కముక్కలుగ ఖండించితీరెద. దుర్మదాంధా! ఎంతటివిశ్వాసహీనుడవు ఔను. కాల్ దేవుని తప్పిదమేమిగలదు! కోరివేడి తెచ్చుకొంటిని ఎంతటిసంకటములకు పాల్బడిపోయితిని. యీపుడమిపై జీవించినను జీవించకపోయిననువట్టిదే ఆ! మరచితిని మరచితిని. విమలసింహుం నాకు ప్రతికూలుడైనందుకు అన్యాయముగ నకారణహేతువు గల్పించి పురిదీయించితినే! హా! విమలసింహా విమలసింహా ఆమహాపాపమునన్నుకట్టి కుడుపుచుండెనుగదా! విమలసింహా విమలసింహా నన్నుక్షమించుము. క్షమించుము. నాయీపాపముక్తినిష్కృతిలేదు. "ఏమనుచుంటివి. నన్ను ఖండించి తీరెదననుచుంటివా నాయినా ఎందుకంతకోపము నాఆత్మస్వర్గమునందైనను గనిశాంతివహించలేదా విమలసింహా స్వర్గవాసులకుశాంతిదయుండునని బల్కుదురుగదా! అచటిచింతామణి, కామధేనువు, కల్పతరువు, పారిజాతము, రంభోరప్సరసలనాట్యముచూచుటలేదా! నీవుభూతమై వచ్చితివా! నన్ను బురికొల్పి జంపనెంచితివా! ఔను చంపుము చంపుము నీకపకారమొనర్ప లేదా! నిన్ను(తీయలేదా! నీకుగాక నాపైనగ మరెవ్వరికుండును. అయ్యో! విమలసింహా విమలసింహా పొడువకుము పొడువకుము బాధ పొడిచితివా! నిజముగపొడిచితివా! అని కెవ్వునరచి భిల్ల వాకిటి యందలి యొకజీర్ణమందిరమున మలినశయ్యపై బడిపో

మెను. అచటనలువురుభిల్లులు నిత్యము రఘునాధుని కాయు చుందురు. కెవ్వుమనియరచిన యరపువిని వారచటజేరి చూచి రి. రఘునాధుని శరీరము మిక్కిలి యుష్ణముగ నుండెను. కల వరించుచుండెను. దొర్లుచుండెను. విశేషజ్వరమంతటనే యాత ని నావరించి వైచెను. రఘునాధుడగునా! ఏమి ఏమో కాలమందరికి వెళ్ళియుండెనా. ఇతరు నధిక్షేపించు జనుడు తాను గూడ నాక్షేపణ బొందకుండునా ఎప్పటికైన తప్పదు విధిలిఖి తము వారలొనరించు కొనిన దుర్భర పాపము—రఘునాధుని స్థితియటులుండెను.

వుదయపురియందు నాటిరాత్రియా మిసీశీతకిరణములు పుడమిపై ధవళకాంతులవెదజల్లు చుండెను. సహస్రదీపికాజల ములవలె తారలుమిలమిల మెరయుచుండెను. కోయిలలందం దువృక్ష శాఖాంతరములంజేరి కుహూధ్వానము లరుత మొన ర్చుచుండెను. అందందువికసించిన పుష్పగుచ్ఛములనుండి సుగం ధము మలయానిలుడన్ని దెసలవిరజిమ్ము చుండెను. ఆపందువె న్నెలమిగుల మనోహరమై ఆనందమయునిజేసి వైచుచుండెను. అందందు గున్నగున్నలుగ బెరుంగుచున్న రంభాతరులనుండి ఇటునటునల్లలనాడు వేయనంటిఆకులా కందువెన్నెలలకు వింత కాంతులనానుచు మిలమిలమెరయుచు నుయ్యాలలూగుచుం డెను. అచట ఎరుపుతెలుపు రంగులుగల గోరింతపూవులు విక సించి ఆనందముగూర్చుచుండెను. సుమారొక కురువుదూరము సకల నుదయాపురీ సౌధంబులు వెన్నెలవెలుంగున శృంగారమై ధవళ కాంతులచే నొప్పారుచుండెను.

అచటగల నొక యుపవనమునం దొక యువతీలలాము యమాల్యవస్త్రాభూషితయై సంతోషతరంగితమగు నంతరంగము తోను ఆశాప్రపూర్ణమైన యనురాగముతోడ నాయింతి యెవ రిరాకకో నిరీక్షించుచుండెను. ఒక పుష్పమునుండి మరొక పుష్పమున కెగయు షట్పదమురీతి యామె హృదయము దిరు గాడుచు నొకపరి దరహాసచంద్రికలతోడల మరియొకతరి ప్రేడానకుంచిత భావముతోడను నుయ్యాల లూగుచుండెను.

ఇంతలో నొక యువకు డచట మాల్యవస్త్రాభరణుడై విలాసముగ నరుదెంచెను. వెంటనే యాయువతి లేచి నిలువబడి యువకుని గని "నేడునాహృదయమున సంపూర్ణచంద్రు డుద యించెను" అనెను. "అగుగాక: ఒకచంద్రుడు నీహృదయమున ఉదయించెను. ఆపైనున్న చంద్రుడు నాహృదయము జొరబడి ప్రేమయనెడి దివ్యాక్షరముల చల్లగ హృదయవీధిని లిఖింపజే యుచుండెను"

వారిరువురు యువకులే పురుషునకు నిరువది యారువ త్సరములుండును: యువతికి నిరువదిరెండు వత్సరములుండును. మాపాఠకులు వారెవరో గుర్తించియుండరు.

యువకుడు, విమలసింహుడు, యువతి సుకేశిని (చం ద్రావతి) అని ఒక శిలాఫలకమున వారిరువురు గూర్చుండి యుండిరి. పూర్ణచంద్రుడు వారిశరీర మంతంతయు ప్రసరించి వారిసుందరవదన మండలము మరింత సుందరముగ జేసి వెను చుండెను.

ఒకరికి నీడుడీయుని మరియొకరి సౌందర్యమున తారా చంద్రుల, సీతారాముల, శచీంద్రులతో తులదూగు చుండిరి.

అంతటాయువతి విమలసింహుని యంకముపై తలనుంచి విమలుని సుందరతమమగు సౌందర్యము గ్రోలుచు ముఖపద్మము నందలి రుచుల జవిచూచుచుండెను. ఆచంద్రావతి మృదుహస్తములు రెండును విమలుని కంఠమును కౌగలించుకొనెను.

కొంతవరకెవ్వరును మాట్లాడలేదు. మరల కొంతవడికి చంద్రావతి "ప్రియా! నాటిరేయి కరుణారస తరంగిణులై మీరిరువురు రాకుండిన యీనాటి మహాసౌఖ్య మబ్బకపోయి యుండునుగదా! "చంద్రాసిశ్ఛయమే కుటిలహృదయుడగు రఘునాథుని ప్రవర్తన తనకేగాక చాలమంది హృదయములు చెదరగొట్టబడెను,

"విమలా! ఆభిల్లులు నన్ను బలినీయు సమయమున ఎంతటి దురవస్థ పాల్పడియుంటినో దైవమెరుంగును.

"చంద్రా! ఆనాటి కష్టకాలపుకథ మరల నేలజ్ఞప్తికి దెచ్చుకొందువు. ఇదిశృంగార సమయము. ఇట్టి ఆనందతరుణమున హృదయములు నిర్మలముగ నుండవలెను.

"నాథా విమలసింహా: ఏమి నీయాదరణ నీమృదువచనములకు నాహృదయము ద్రవీభూతమై పోవుచుండెను.

చంద్రా! ఇది యువతీయువకులకు గల ప్రణయమందలి గూఢ పదార్థముగాదా?

"ప్రాణేశ్వరా! నాశరీరము నీరువిడుచుచున్నది. ఈప్రవాహము వెల్లువయై పారుచున్నది. ఇకనిట్టి శ్రీవంతిని గట్టివేయవ ? "చంద్రా! ఎంతబేలవు" "అని యామెను బిగ్గగౌగలించుకొని యధరచుంబన మొనర్చెను.

వారిరువురా నిర్భయానంద సమయమున యొకరి కౌగిటిలో నొకరెంతకాలముండిరో వారలె యెఱుంగరు.

తనమృదు వీక్షణముల చంద్రావతి విమలసింహుని మరింతమోహమున ముంచుచుండెను. మన్మధుడదియెరింగి వెనుకటికన్న వేయిరెట్లు తనపుష్పశరముల విడజిమ్ముచుండెను.

మలయానిలుని సహాయమున వికసిత పారుజాతములు వారిరువురిపై జల్లున నెగిరి రాలుచుండెను. వారదిగని మిగుల మోహముగ్ధులై పోయిరి. చాలరాత్రి గడచుచుండెను. అంతట చంద్రావతి విమలుని ముఖము వీక్షించి.

"నాధా! నన్ను గాఢానురాగమున జూచి పాలించుదువా? యనెను. విమలసింహుడు చిరునవ్వు వెదజల్లుచు" "సుందరీ నీవు నాప్రేమైకమూర్తివి. నేను నీప్రేమనటుడను ప్రేమకింకరుడను అనెను. చంద్రావతి విమలుని మరల నొక్క ముద్దు బెట్టుకొనెను.

విమలుని తీయని హృదయము చంద్రావతి నిద్దంతో మనుజెక్కలపై పోవుచుండెను. ఇంతలో నొకడోలికయందొక వృద్ధుని దోడ్కొని యిరువురుమనుష్యులటకు వచ్చుచుండుట జూచిరి. ఇరువురు లేచి నిలుచుండిరి. వారాడోలికచట

డింపిరి. అందున్నవృద్ధుడాయానముతో "అమ్మా! అమ్మా! చంద్రావతీ" అనిపిలచెను ఆపిలుపువినినంతనే చంద్రావతి కంఠస్వరము గుర్తించి దడాలున హా! దాదా! దాదా! అని ఏడ్చుచు నాడోలికవద్దకు బోయివిలపించుచుండెను.

ఆవృద్ధుడు నారాయణసింగనియు మనచంద్రావతికి తాతయనియు పాఠకులు గుర్తెరింగియేయుందురు.

కొంతవడికి వృద్ధుడాయాన మువశమింపుకొని "అమ్మా యి మరల కన్నులకు నిన్ను గన్పింపజేసినందుకా భగవంతునికి వేనవేలు నమస్కారములు" అనెను.

చంద్రా:—దాదా! నీకొరకెంతయో వగచి వగచి దిక్కులేనిపక్షినై పోతినని విలపింపగా నేటికి భగవంతుడనుగ్రహించినందుకు చాల కష్టములు తొలగిపోయినవని తలంచుచుంటిని అనితనచేలాంచలముతో కన్నీరు తుడుచుకొనుచు వృద్ధుని శరీరము తడుముచుండెను.

వృద్ధుడగునారాయణసింగు వట్టిపెను కలపోగై యుండెను. శరీరమందలి మాంసమంతయు క్షీణించిపోయెను. రక్తమనతేలేనట్టు లుండెను. అంతటవృద్ధుడు "అమ్మా! నిన్నాదురాత్ముడేమిచేసెను తల్లీ"యనెను.

"దాదా! ఆదుర్మార్గుడు నన్ను మానభంగ మొనరింప యత్నించినంతనే నావద్దగుప్తముగ దాచిన కత్తి చేయూతనిపొడిచిపారిపోయితిని. తదుపరి సకలరాజ్యములు దిరిగితిని. నీజాడ ఎంతమాత్రమును తెలియబడనందున ఆరాక్షసుడు నిన్నుగూడ

జంపెననియెంతయో విలపించితిని ఇంతలో కేరొక కారణమున భిల్లులనాయకుడగు కాల్‌దేవుడు నన్నుబట్టుకొని తమదేవతకు బలియివ్వవలసినదని తనసేవకుల కాజ్ఞాపించి తానుసింహపురీ నగరమును ముట్టడింపబోయెను. నన్నాభిల్లులొక పాతాళగృహములో దాచివైచిరి. అచటెంతయోకాలము నిద్రాహారములులేక బయల్పడుతావులేక పరమేశ్వరుని ధ్యానించుచు కాలముబుచ్చుచుండగా ఒకనాడకస్మాత్తుగ నన్ను నలువురుభిల్లులు కట్టివైచి దుర్గగుడియందు బలిపశువును జేసిరి. నీకొరకు నాజనకునికొరకెంతయో విలపించుచుండగా కాల్‌దేవునిచే నియమింపబడినభిల్లు తన కత్తినెత్తి నన్ను బలియిచ్చెను. నాశిరస్సు వంచియుంటిని అంతియే. తదుపరినాకన్నులు చీకటులు గ్రమ్మిపోయినవి. పిదపకొంతసేపటికి ఆనిలుచున్న మహానుభావుడును పుదయపురిమంత్రియగు సనత్కుమారుడును గన్పించిరి. వారలు కొత్త వారగుటచే నాకదియంతయు స్వప్నమువలె దోచెను. అచట వీరిరువురు చాలమందిభిల్లులజంపి నన్ను బలినుండి తప్పించిరి. నాటినుండి తిరిగిమనగృహమునకు వచ్చితిని. శూన్యముగు గృహమునందు నీవు లేకునికి మరింత అంధకారమైపోయినది.

దాదా! నావంటి అదృష్టహీనురాలగు అబలవలన నీకెన్నియో విపత్తులు గలిగినందుకు మాత్రము చింతించుచుంటిని అనెను.

అంతటావృద్ధుడు అమ్మా! ఈసంగతియంతయు సనత్కుమారునివలన వినియుంటిని. నీజనకుడు జీవించియుండెనని మాత్రముదెలిసినది. ఎన్నటికైన అదృష్టవంతులమైన యెడల తిరిగిజూడగలుగుదుము. అనెను.

వెంటనే దూరముననిలుచున్న విమలసింగుని వృద్ధుడు దరికి బిలిచెను. విమలసింహుడు వృద్ధునకు వందనమొనర్చి వృద్ధుని యాదేశమున నచ్చట నేకూర్చుండెను. అంతట నారాయణసింగు విమలునికరము తనహస్తమునబట్టుకొని—

“నాయనా! నేనుశతవృద్ధుడను నాశరీరమందలి రక్తమాంసములు పోయినవి. నేనుసుఖపడు దినములలో నాకుమారుడు దేశాంతరగతుడై పోయెను. మిగిలినదినములలో నేను జయసేనునివలన చెరబడిపోయితిని. నాజీవితశేషము కష్టముల కాకరమైపోయెను. ఇంక నేను జీవించుటకల్ల. నా ప్రాణమీబొందినుండి ఇకనో మరియొక గడియనో వాయువున గలసిపోవును. నాకడపటిసందేశము శ్రద్ధగా వినుము తండ్రీ. నీచరిత్రయంతయు సనత్కుమారునివలననివిని చాల సంతసించితిని.” అని అనునంతలో సనత్కుమారుడు, యతనిభార్య శాంతాదేవి అచటకు వచ్చిరి.

ఇంతలో కొన్ని యుచితాసనములు దెచ్చివైచిరి.

వానిపై నందరధిష్టించి యుండిరి.

పిమ్మట వృద్ధుడాయాస మెక్కుడయ్యెను. ‘చిరకాల దృశ్యము’ ఇకనొక్కపలుకైన యాతని పెదవిదాటి వచ్చుటతి కష్టమయ్యెను. నెమ్మదిగ “సనత్కుమారా! వ-య-సున నీవు నాకన్న పిన్నవయ్యు సుగుణవంతుడవు ఈబిడ చంద్రావతి నీ సోదరిసుమా! అట్లెంచుకొనుము. ఈవీరుడగు విమల-సిం-

కుని పరిణయమాడుటకు చంద్రావతి యిష్టపడిన నాకన్నుల యెదుట పూలమాలిక లలంకరించుకొని స్వయంవరమున నేటి రేయి వివాహము గావింపుడు." అనెను.

అందులకందరి సమ్మతి బడసినమీదట వృద్ధుడు చంద్రావతి కరమును విమలుని కరమందుంచి "తండ్రీ! ఇకనీబిడ్డ కష్టసుఖములు నీవిగాని మావిగావు. నీటముంచినను పాలముంచిన భారమునీదియే. యనివచ్చగించునంతలో శాంతాదేవి రెండుపుష్పమాలికల దెచ్చి యిరువురకిచ్చెను. వారిరువురు మోహమగ్నలముకాగా చిరునవ్వు మొలకలవెదజల్లుచు పుష్పమాల నొకరికంఠసీమలొకరు లలంకరించుకొనిరి.

వృద్ధుడాయానసమధికమైపోయెను. ఇంతలో విమలుడొక పుత్రరముపై టికిదీసియిట్లుచదువుట కుపక్రమింపగానే "అయ్యో బాధ... బాధ... రా-మా-రామా" అని వృద్ధుడగు నారాయణసింగిలోక మొక్కవరి విడిచివైచెను. ఆతని ప్రాణవాయువులు చంద్రకిరణములతో కలసిపోయెను. ఇకనేమున్నది. వృద్ధునకాలధర్మమునొందెను వెంటనే విమలుడాకమ్మ మరల తన యంగీయందు భద్రపరచెను.

దాదా! దాదా! యనిగొల్లున చంద్రావతి విలపించుచుండెను. సనత్కుమారుడు, విమలుడు, శాంత కన్నీరుగార్చుచు చంద్రావతి నూరడింపుచుండిరి. వృద్ధుని యారామమైన యాస్థానముందే యాతని ప్రాణవాయువులు వెడలిపోయి

నందుకందరు కొంతగ సంతసించిరి. తదుపరి వృద్ధునికి జరుగవలసిన క్రియలు విమలునిచే జరిపించిరి. హా! దైవచిత్రము ఒక గడియకిృంద టమందానందములందు చంద్రావతి మద్దునెమ్మొగము ఎంతలో ఘోరవిచారమందు మునింగిపోయెను పాపము?

వృద్ధుడు తన మనుమరాలిని స్వహస్తములతో విమలునికి భార్యనుగావించెనని మాత్రము ముఖ్యముగ సంతసింపవలసిన విషయమైయున్నది.

# మా ల తి.

## ఇరువదియొకటవ ప్రకరణము.

### తల్లికొడుకులు.

ఒకానొకనాటిపగలు రెండవయామమందున నిరువురుబాటసారులు ఆరావళీపర్వతముల దాటి చాలదూరమునడచివచ్చిరి. ఆనాటియెండ అంతమిక్కుటముగ లేదు. కాని వృక్షరాజముల నుండి యొకపత్రమైన కదలుటలేదు. మిగులనుక్కగనుండెను. నాటిదిన మమావాస్యయగుటచే గమ్యస్థానము జేరలేమనియు చీకటియందు నడచుట దుర్భరమని చెప్పుకొనుచు బోవుచుండిరి.

అందొక పురుషుడు స్త్రీయు నైయుండిరి. మార్గము న్ననో గండశిలామయ పర్వతపంక్తుల నడుమ నాబాట పోవుచున్నది. ఆబాటచాలయిరుకుగనుండెను. దేవదారు వృక్షములిటునటు యున్నత్తుగ బెరిగి పట్టపవలేనచట చీకటికి తావిచ్చుచుండెను. ముందునకు బోయినకొలది పెద్దపెద్ద రాళ్ళతిప్పలుగుండ నామార్గము పోవుచుండెను. భీకరములగు కొండబిలములు మరింతభీకర మొనర్చుచుండెను. కోతుభీషణంబులదాల్చిన పర్వతములనడుమ నెంతటి ధైర్యచిత్తులయినను భీతిబొందకపోరు. అదినిర్మానుష్య ప్రదేశము.

క్లిష్టతరమగు నామార్గ మాప్రయాణికులకు మరింత సంకటపాటొదవజేయుచుండెను. ఎందుచూచినను బోడిరాళ్ళగుట్టలు ఎండకుమొండివానకుదడసి దరిద్రాణమైయొప్పుచుండెను. వాటిజూడ నసహ్యము, భయంకరముగూడ దోచుచుండెను. మధ్యమధ్య నడ్డముగ మెలికలుదిరిగిపోవు నదుల వంచన అద్వితీయమగు నొక కొండమల్లెయో మనోహరమగు ద్రాక్షతీవయోవలె గుంపుగబెరిగి కష్టములో సుఖమనుపటుల పాంధులకు కొంతనలసట దీర్చునవియైయుండెను.

మానవుని హృదయముబట్టి ప్రకృతి విపరీతముగ గన్పట్టుచుండును మలినవస్త్రాలంకృతులై, పొట్టనిండ నింతయాహారమైనలేని మనకష్టపు తెరువరుల కదిఅసూయత గల్గించు ప్రదేశమై పోయెను. నిర్విచార పురుషుడచ్చోటు గనినవెంటనే యాతనికన్నియు ఆనందమయమైనటుల బొడచూపుచుండును. ఇది నైసర్గికము.

వధపరిశ్రాంతులై మిగుల డస్సి క్లిష్టతరమగు నాకొండ కనుమలమధ్య అరికాళ్ళు బొబ్బలెక్కి నెత్తురులు గారుచున్నను సరకుగొనక నాతెరువరు లాబాట నడకయే పోవుచుండిరి.

అంతట నాయబల పురుషునిజూచి "నాయనా! ఇంకెంత దూరము నడువవలయును" అని ప్రశ్నించెను.

"అమ్మా! యిక నెంతయోదూరము లేదు. మెల్లగనడువుము" అనెను. "కుమారా! నాఅరకాళ్ళు నెత్తుటివరదలైపోయినవి ఒక్కఅడుగైన గడుపుటకు శక్యముగాకున్నది."

అమ్మా! కష్టములు మనుష్యులకుగాక మాన్నుల కెల్లువచ్చును. అనివారు నడిచిపోవుచుండిరి. వారిరువురు తల్లి కుమారులైయుండురు.

ఏమహాతల్లి ఎండకన్నెరుంగక, శుద్ధాంత కాంతారమున మెలంగి గణుతి కెక్కియుండెనో, ఏరాజీవలోచన మణిమయ ఫలకములపై అరికాలంటకుండ నడచియుండెనో, ఏమహాసాధ్వి పతిపాదపూజా దురంధరురాలై సాటివారిలో మెప్పుజెందియుండెనో, ఏమహాతల్లి భర్తగతించినదాది సుఖమనుమాట నెరుంగక కష్టజాలములనెల్ల నడచిపైచి ఎన్నిటికైన నెదురొడ్డి విజయముగాంచ నెంచెనో, అట్టిమాత, అట్టియిల్లాలు, అట్టిపతివ్రతాశిరోమణి, అసూర్యంపశ్యయగు మహారాణి నరకకా యీపాట్లు పరమేశ్వరుడు లిఖించెనని యామె కష్టము జూడజాలక లోకబాంధవుడు ఖిన్నుడై అస్తంగతుడయ్యెను.

ఇకగాఢాంధకారము నలుదిక్కుల పిక్కటిల్లుచుండెను. ఆసమయముకు వారిహృదయములు మరింత భీతిజనించెను. ఆబిడ కరమును దనహస్తముచేబట్టుకొని యూతగ అమ్మా! నావలనెంతటికష్టములకు తలయొగ్గవలసివచ్చెను. తల్లీ! నన్ను గురించియేగదా దురాత్ముడగు రఘునాథుడు నీవంటి మహా స్వాధ్వీమతల్లి యుసురున బడిపోవడా! నాయనా! కానిమ్మా! దైవమేమిచేయించిన జేయనిమ్మా. ఆమహారాజు గతించినదాది కష్టములెగాని సుఖమనుమాట కలనైననెరుంగముకదా! మన యుసురుగొట్టి ఎన్నటికివాడు పోవునో దెలియను. ఇట్టుల ఆతల్లి కుమారులు మాటలాడుచుండగనే కూతవేటదూరమున జన పదము సందడి విని వారలచటనుండి వృత్తరముగపోయిరి. అదితారకపురము. ఆరాత్రి వారచట గడపనెంచిరి.

నూతనపురము జేరుటకు వారలకెంతయో కష్ట మని పించెను. పుట్టి బుద్దెరిగినపిదప నెవ్వరిని యాచించియెరుగరు. రామదేవళమువద్ద తల్లికుమారులు దిగిరి. కుమారుడగు వసం తుడు గ్రామమునకు బోయి కొన్నిపదార్థములు సేకరించి తల్లిని జేరెను.

ఆకొలదిలో యిరువురు చేరియొక గుప్పెడు మెతుకులు దిని యారాత్రి యచట పరుండిరి. దూరప్రయాణము, కష్ట ములకు నోర్చి వచ్చుటచే వెంటనే వారలిరువురకు గాఢమైన నిద్ర యావేశించెను.

ఆరాత్రి గడచినపిదప తెల్లవారెను. కిలకిలమనిపక్షులు రుత మొనర్చుచుండెను ప్రభాతవాతపోతములు మందమంద ముగ ప్రసరించుచుండెను. ఆతల్లికుమారులు మేల్కాంచిరి.

కాలోచితకృత్యములు దీర్చుకొని యానాటికి శ్రమవాయుటకై వారచటనే విలువనేర్పరుచుకొనిరి. ఎచటికిబోవుటకు వారికి తెలియదు. ఎందుకై వెడలుచున్నది వారెరుంగనిస్థితిలో ఎన్నియో దేశములు గడచుచుండిరి.

వెంటనే సరళాదేవి వంటనుగించెను. అతల్లి కుమారులు మరల భుజించిరి. ఇంతలో నలువురాశ్విక యోధులు వారిగమనమున వారుపోవుచుండిరి. వారలేదియో తీవ్రమగు కార్యమునకై పోవుచున్నటుల దోచుచుండెను.

అందిరువురుయువకులు, యిరువురుస్త్రీలునైయుండిరి. వారలా రామదేవళము సమీపించుసరికెండ మిక్కుటముగ గాయుచుండెను. ఆదేవళంబునదిగి తాము దెచ్చుకొనిన పదార్థముల భుజించుటకు వారు యత్నించుచుండిరి.

వసంతుడు నిద్రపోయెను. సరళాదేవి యటగూర్చుండి యాయాశ్వికులు వచ్చినవెంటనే యొకమూలకు బోయెను.

అశ్వికులు నలువురు దిగిరి. వెంటనే వారలాదేవళంపు దక్షిణపువైపునగల నేల శుభ్రపరపించి యటగూర్చుండిరి.

పాఠకమహాశయా వారలెవరోయని తలంచవలదు. సనత్కుమారుడు, శాంత, విమలసింహుడు, చంద్రావతి. చంద్రావతి యేమకేశిని యని ఎరుగుదురు.

అంతట చంద్రావతి యాదేవళంబంతయు జుట్టివచ్చు టకు దిరుగుచుండగ సరళాదేవి గన్పడెను.

వెంటనే చంద్రావతి అమ్మా! మహారాణి! ఎన్నిదినం బులకు మరల మిమ్ము జూచుయోగ్యత లభించెను. వెదుక బోవ తీవ గాలికి తాకినన్నటుల మాభాగ్యవశమున మీరిచ టనే మాకు తటస్థించిరి. యువరాజు క్షేమమా? యని ప్రశ్నించెను.

పురుష వేషమునను న్న యామె పలుకులకుతన్ను దెలసి మాట్లాడుట చూడ సరళ భయాశ్చర్యములకు లోనయ్యెను. అదిగని చంద్రావతి అమ్మా! నేను పురుషునని భ్రమించు చుంటిరికాబోలునని పైనున్న తనపురుష దుస్తులవిడదీసె చెను. వెంటనే స్త్రీయు మరియు మహారాణికి చెలికత్తెయు నైపోవుట మహారాణిజూచి—

గుభాలున సుకేశినీ! సుకేశినీ! యెంతదయ లేకపోయినది? ఇన్నినాళ్ళు నన్నువిడిచి ఎందుంటివి. తల్లీ అని బిట్టువగచెను. సరళవిడ్పువిని వసంతుడు మేల్కాని సుకేశినిజూచెను. వెంటనే వసంతుడు సుకేశినితో సుకేశినీ! ఆనాడు వచ్చిన జోతిష్కుని తో వెడలిపోయితివి. ఇంతవరకు మరల గాన్పింపవైతివి. నీచరి త్రవిన గుతూహల మగుచున్నది. తెల్పుమనికోరెను.

కాంతవంటకముల ముగించెను. మహారాణి, వసంతుల విమలసింహ సనత్కుమార కాంతలుజూచిరి.

అందరు భుజించినపిమ్మట వారలాదేవళంబునొద్దనే బస జేసిరి.

మరల వసంతుడు ప్రశ్నించగ చంద్రావతి, మహారాణి మొదలగువారికి తనచరిత్ర యీక్రింద విధంబున దెలియజేసెను.

"అమ్మా! ఆనాడువచ్చిన జగన్నాథజోతిష్కుడు నాజనకుడు. ఆతనిని మొట్టమొదట గ్రహింపజాలక బోయితిని. నేనాకనాటిరోజున తమయాజ్ఞపాలించిమంత్రిగారింటికి పోయియుండగ మంత్రి కాల్దేవునిచే జయసేనుని కొకకమ్మ లిఖించుచుండెను. ఆలేఖ నాకన్నులారగాంచితిని. తల్లీ! అదితలంచుకొనిన నాగుండె జల్లుమనుచుండెను. ఆలేఖయందు యువరాజు శిరస్సు నరుకుటకున్ను మిమ్ముల కాల్దేవుని వశమొనర్చుటకును రాజ్యముతానుపాలించుటకును తనకుమార్తె సౌదామిని జయసేనుని కిచ్చునటుల గల లేఖంగాంచి నాహృదయము కంపించినది. ఆనాటిరోజుదాటిన కొన్నాళ్ళకు సౌదామిని యాదేశము చొచ్చిన జోతిష్కుని జూడబోయితిని. నాటిరాత్రి నన్నొంటరిగ రావలసినదని చెప్పినవెంటనే సౌదామినీ భావిఫలమునకు మిగుల నానందించి ఆరాత్రియే వెడలితిని.

నాతండ్రి అద్వుడు మరల నెందుకురావలసినదని జెప్పెనో నాకెంతమాత్రము బోధపడలేదు. నేనువెడలినవెంటనే "సౌదామినికోరిక కొన్ని కష్టములమీదగాని నెరవేరజాలదు. తుదకు కోరికఫలించును" అనెను. నేనంతట విసుగుదలతో "ఇంతమాత్రమునకేనా!" యని పల్కితిని. మరికొంతవడికి అమ్మా అమ్మా అని పెద్దపెట్టుగనేడ్చి మూర్ఛబోయెను.

నాహృదయము కంపించిపోయెను. మాదాద చెప్పిన యానవాళ్ళు గలవేమోయని దీపపువెలుంగున మాజనకుని వీపు

పరీక్షించితిని. ఇక నేనున్న దిక్కు యొకకత్తి వాటు ప్రక్క రెండుపుట్టు మచ్చలుండుట గాంచితిని హా! జనకా! జనకాయని యెంత యుపెద్దపెద్దగ చింతించితిని అంతనాజనకుడు నన్ను గ్రుచ్చి, గ్రుచ్చి తల్లీ! తల్లీ! నీయుద్దు ముచ్చటలు జూడజాలకపోయితిని. నాతండ్రికి నాకుగల విరోధంబున దేశాంతర గతుడైతిని. అచ్చ ముగ మీఅమ్మనాలికనుబట్టి గ్రహించితినని విచారించెను.

మరల వచ్చెదనని జెప్పి వెడలిపోయెను. నేను నాజనకు నితో కల్యాణపురము వరకు బోతిని. అచటనుండి తిరిగిమీ సేవకై వచ్చుచుండ నన్ను కాల్ దేవుడుబ ధించి వైచెను. తిరిగి కాల్ దేవుని బాధనుండి యీవీరులవలన బ్రతికితిని తల్లీ నాతాత కాలముచెందెను. ఇ తవరకు మరల నాజనకుని జాడ నరయుచున్నను గాన్పించలేదు మేసుందరము మీయిరువురి కొరకై సకలదేశములు తిరిగి యిచ్చట బొడగంటిమింతియే మావృత్తాంతమని జెప్పెను.

అందరు సంతసిల్లి హృదయారవిందులైరి.

యువరాజు సౌదామినీ వృత్తాంత మేమని మరల ప్ర శ్నించెను. అచటనున్నవారి కెవ్వరికిని సౌదామినీ వృత్తాంతము దెలియనందున నెవ్వరును జెప్పియుండలేదు.

మహారాణి, వసంతుల వెంటబెట్టుకొని వారందరు నాల్గు దినములలో పుష్యయపురిని జేరుకొని భావిప్రయత్నములకై యూహాలు పన్నుచుండిరి.

విమలసింహుని గురించి యెవ్వరును ప్రశ్నింపలేదు... పరమేశ్వరుడ దర నొకదెస జేర్చెను.

# మాలతి.

## ఇరువది రెండవ ప్రకరణము.

### పిచ్చివాడు.

ఉషఃకాలమున పూర్వదిశ నరుణరాగము లలముకొనుచుండెను. సమీరకుమారుడు చల్లగ సుందరిని నెమ్మదిగ జోకొట్టుచునేయుండెను. తమ యండజముల గూండ్లనుండి ద్విజము లెరలకై పోవుటకుం దమ ముక్కులం బైకెత్తి కిలకిల మనిమృదుమధురముగ రుతమొనర్చుచుండెను. తీయమామిడి చెట్టుపైనున్న కోయిల కూహూ కూహూయని శ్రావ్యగీతము బాడుచుండెను. నవ వికసిత కుసుమములనుండి మంద మంద పరిమళంబులు పరిఢవిల్లుచుండెను. అంతయు ఆనందమయ సమయము. అట్టి ఆనందమును గని సుఖించు నిర్మల నిర్విచార పురుషులే తన్మయత్వమునొంది ప్రకృతికాంతకు వందనమర్పించును. లేనియెడల విషాదహృదయునకిదియన్నియు విచారమునే సూచింపుచుండును.

ఒకపిచ్చివాడు సింహపురీనగరముదాటి వడివడిగ పరువిడి పోవుచుండెను. అతడెంతదూరముపోవుచుండెనో ఎచటకు బోవలయునో ఎందునిమిత్తార్థమై వెడలుచుండెనో యాతనికే తెలియనపుడు మనకేమి తెలియును. ఆనాటి ఉదయమునుండి సాయంతనముకు సింధుమాలనగరము ప్రవేశించెను. అచట

ఆరాత్రి తదేకదీక్షగ నడిచి చిత్రపురీనగరము చేరెను. అచట నుండి ఈశ్వర పురము మొదలగు పట్టణంబులు దాటిపోవు చుండెను. నాటి మొదలయిదు దినములవరకు తారకపురమున గొప్పయుత్సవములు జరిగించు నాచారమైయున్నది. ప్రతివత్స రమటులే చేయుచుందురు. అందుగల తారక రాముని దర్శింపని వారుండరు.

శ్రీరాములవారు తారకమును ఆంజనేయుల కుపదే శించు పుణ్యదినములని పెద్దలు చెప్పుదురు.

అట్టి పుణ్యదినమున వెనుకటి ప్రకరణమున వుదహారిం చిన దేవలంబునొద్ద విశాలమగు పందిళ్ళువేసి యచట మహా వైభవమున జనులు భజనలు, అన్నదానములు చేయుదురు.

పిచ్చివాని మార్గమున ఎందరో పోవుచుండిరి. అతడెం దరినో దాటెను. దారియందు మధ్యమధ్య నాగుచు ఎగిరెడి పక్షితో వేదాంతము పలుకును. పారిపోవు శునకమును జూచి సంగీతము పాడును.

ఆదాంపోవువారందరు నాతని పిచ్చివాడని యూహిం చి పోవుచుండిరి. ఆయున్మాదు డొక గుడ్డపేలికల మూట తన తలపైనుంచుకొని యిట్లులనుకొను చుండెను. "ప్రపంచమే దుఃఖమయము. అట్టి దుఃఖమయమగు ప్రపంచములోకిన్న మనుజులెంత దుఃఖితులగుచుండిరో తెలియదు. అంతారామ మయం. బీజగమంతా రామమయం. ఆహా! దుర్మార్గులు, సన్మా ర్గులు కలరు ఫుంటే నాకేమి. దుర్మార్గులుంటే నన్ను చంపు

తారా! పిచ్చిమాట అందరూ ధనవంతులేనా! ఏమో. ధన వంతులు లేకపోతే మాత్రమేమి. ఇది చాలును.

మంచి-చెడ్డ, పొలము- పుట్ర, చెట్టు-చేమ, లక్షాధి కారి-భిక్షాధికారి, మొరక-కల్లు. నీరు-పాలు. రాజు-బంటు. ఓహో! రాజుమాటంటే తెలిసింది. మారాజు ఏమైపోయాడో ఎక్కడున్నాడో తెలియదు. ఏమన్నా అంటే కోపం. వూరుకుంటే తాపం. మారాజుకు పెళ్ళి. పెళ్ళి-పెళ్ళోయి రండి. చూడండి. ఆనందించండి. పెళ్ళికి ముందు నెత్తురు వరదలు పారాలి. ఎన్నో పీనుగులు కోటపై గుట్ట లెక్కించాలి. పెళ్ళిచెయ్యాలి. పుష్పం దాగిపోయింది. ఏగురుజులో వుందో—ఏఆకులసందున యిమిడి వుందో ఎవరికి తెలియును? కల్ల. నేను నేనేనా, లేక నా అన్న గారినా ఏమో నేను నేనో కానో నారాజే చెప్పాలి. రాణి చెప్పాలి అని ఏమో అనుకుంటూ తారకపురము ప్రవేశించెను.

కోలాహలముగ నచట భజనలు హరినామసంకీర్తనలు జరుగుచుండెను. అన్నదానము విశేషముగాజరిగిపోవుచుండెను. ఒకచోట పురాణము- వేరొకచో-వేదాంతము. అన్నిచూ చాడు. ప్రతిమనిషిని మొగంవద్ద నిలుచుండి పరీక్షించాడు. ఆమరునాడు వెడలి పోయాడు.

ఆపిచ్చివాడు ఆరావళీ పర్వతప్రాంతమధ్యకు చేరాడు. అల్లరిచేయుచుండగా కొందరు భిల్లులు వానిచుట్టూచేరి వేళా కోళములు, పరిహాసములాడ మొదలుపెట్టారు.

భిల్లాంగనలు కొందరు నన్ను పెళ్ళిచేసుకుంటావా అని అడిగారు పకపకా పిచ్చివాడు నవ్వి పాంపోయాడు. మరల పిలిచిరి. ఈసారి కొందరు భిల్లులుచేరి తమకొక ఆటవస్తువుగ నాతని నాడించిరి. ఎందరెన్ని చేసినను అందరికన్ని రీతుల పరాభ వించడం మొదలుపెట్టినాడు. ఇంతలో మరికొందరుచేరి

ఓం బ్బీ మంచిపిల్లనుపెళ్ళాడతావా! అన్నారు.

ఓయిప్పుడే మీరందరూ పెద్దలు. నాకు చెయ్యండి పెళ్ళి అన్నాడు వెంటనే యొ భిల్లుడాతని రెక్క బట్టుకొని తీసుకొనిపోవుచుండెను. యీవినోదముకు పలువురుచేరి ఆనం దించుచుండిరి. ఒక నవలావణ్యావతి శుష్కించియుండెను. ఆమె కేశములు తైల సంస్కారమెరుంగక జటలుకట్టిపోయియుం డెను. ఆమెనును చెక్కలు జీర్ణించిపోయెను మలినవస్త్రధా రిణి యగు నాయింతిదకి పిచ్చివాని దోడ్కొనిపోయిరి. పిచ్చి వాడు అచటి చిత్రములుచూచెను. కొందరిని కొట్టెను. కొం దరిని తిట్టెను. నాకుపెళ్ళి పెళ్ళియని గంతులు వేయుచు గుబాలునా యింతి దగ్గరకు ఒక్కపరి పురికెను. ఆమె మోము వంచి మోకాళులపైనుంచి విచారింపుచుండెను.

వున్మాదుడట్లుకి ఆమెమోముజూచి పకపకానవ్వి భిల్లు లారా! నాకుపెండ్లిచెయ్యండి బాగావుంది అనెను.

విషాదపరిచ్ఛిన్న హృదయయగు యాయింతి అసూ యత చూపుల నాతనిపైబరపెను. పెండ్లిరేపు అనివారందరు ఏకగ్రీవముగ జెప్పిరి. ఉన్మాదుడొకింత నేలవంకజూచి మంచి పాటపాడుదును వింటారా అనెను. అందరు పాడమనిరి.

అంతట పున్నాగుడు అందరిని సందడి చేయవలదని గట్టిగ కేకవేసెను. అంతట

"పూలరథం బెక్కి । పోయెడి వేళ
బళిరాయగీతములను । బాడెడి వేళ
విభువేణునాదంబు । వినిపించు వేళ
చిత్రమా - చిత్రమా । చెదరబోకమ్మ
పసిరాయ సౌధంబులో । బతియుండు వేళ
ప్రేమతో మనసిచ్చి । పిలిచెడి వేళ
నానందమూర్తివై । యాడెడి వేళ
చిత్రమా చిత్రమా । చెదరబోకమ్మ
... ... ... ...
... ... ... ...
... ... ... ...
భువనమంతయు గంధ । పూరంబుగాక
మెరుపు దీగల కనుల్ । మిరుమిట్లు గొలుప
దోలవే తుమ్మెదా । తోలవేరథము.

(ఏకాంతసేన)

ఈపాటకు భిల్లు లెవ్వరిహృదయములకు అర్థము కాలేదు. వారలు వెర్రివారలవలె నట్లె చూచుచుండిరి.

ఇంతలో నంతయు నాలకించిన యూయింతి తన తలపై కత్తియున్నాదని పరీక్షింపు మనెడు అది అచటనున్న భిల్లు

లందరు జూచిరి. పున్నాగునితో ఓపిచ్చివాడా నిన్నే చూస్తోంది. పెండ్లి ఆడుతుందిలే లెమ్మని పలికిరి. అంతట పున్నాగుడు "నీ-ల-కంఠా-గరళకంఠా శంకరా"-అని ఎగిరెగిరి పడిపోయెను. మరు వాడు భిల్లులందరు తప్ప త్రాగిరి. ఒకరెరుంగని స్థితిలో వార లచటనే క్రిందబడి దొర్లుచుండిరి. ఆయువతిని—పిచ్చివాని కెదురుగ గూర్చుండ బెట్టిరి. ఎన్నియోపువ్వులు దెచ్చి వారల పై విసరివైచిరి. ఇరువురిని చేతులు పట్టించిరి. అచట అంతకు మున్నే యుంచిన సురను పూర్తిగ త్రావి దుప్పిమాంసము నంజుకొని ఇటునటు పరుగెత్తుచు చాల కల్లోలము జేసి వైచుచుండిరి. మిక్కుటమగు డప్పులధ్వనులు కొమ్ముబూరలు ధ్వనులు చెవులు చిల్లులు బడజేయుచుండెను.

చాల రాత్రి అయిపోయెను ఒకరివెనుక నొకరికి మైకము క్రమ్మి క్రిందబడి నిద్రించుచుండిరి.

ఈసంతోషసమయమున ఆనందముగ నిద్రించు భిల్లులు పిచ్చివానిని యువతిని మరచిపోయిరి. తెల్లవారు సరికి వారిరువురు నచట గాన్పించలేదు. కొందరు భిల్లులు వారికై వెదకుటకు నలుమూలలకు బోయిరి. కొందరు కాళీదేవివలన తమ ప్రాణములు పోవునని భీతినొందుచుండిరి......

భిల్లవాటిక చాల గగ్గోలు పొందుచుండెను.

# మాలతి.

## ఇరువదిమూడవ ప్రకరణము.

### మనోవ్యథ.

అయ్యారే! ఆయన్నులమిన్న ముఖదర్శన మమృత తుల్యమైనది బాపురే! యావాలు చూపులు నాకాళ్ళకు సంకెళులై పోయెనే సుందరులలో కెల్ల సౌందర్యమూర్తి యగు నాయందు వదన దివ్యసందర్శనమెంత కరువై పోయెను. ఏసుందరాంగి స్పర్శసుఖమునకు అమందానంద మొందదలంచితినో! ఏసతీలలామ మృదుమధుర పల్కులకానంద మువ్పొంగి పోవునని దలంచితినో! ఏయువతీలలామ నావంటి నిర్భాగ్యుని గోరి సదా కష్టపరంపరల నొందుచుండెనో.

ఏనిర్మలహృదయ నిజజనకుని యాజ్ఞను ద్రోసిపుచ్చి నాకై ఎంతవిలపించుచుండెనో అట్టి సుగుణాఢ్య! అట్టి సౌదామినిని కష్టపరంపరల నొందజేసి నేనిచట సుఖమనుభవించగలనా! అకటా మాకెట్టి ఘోరతరంబగునెడ బాధము లిఖింపబడినదో నాప్రాణహితుడగు నీలకంఠు డెందుబోయెనో ఆతని కెట్లు ప్రొద్దుబోవునోగదా.

అని యూహించుచు వసంత సింహుడొకనాటి రేయి నిదురరాక ఉదయపురియందు తనకొసంగబడిన సౌధాగ్రమందు వెన్నెలలో చాలసేపు తిరిగెను. వెన్నెల మోహముద్భవింప జేయును. దానికితోడు సమీరకుమారు డగ్నియందాజ్యము వలె మోహము ప్రజ్వలింపజేయును. అన్నిటికిదోడు వికసించిన పుష్పములనుండి పరిమళసుగంధములో మన్మథకూర్తిమిడి యుండును. మనస్సు ఏదియో యొక పదార్థము వాశించిన పుడు అట్టి ఆశాపూరిత వస్తువు తనకెంతయో దవ్వున నున్న పుడు తనకోరిక రిత్తగాక ఫలించునని హృదయమున తలపొం టుప్రకవాసి భావము వికసించినపుడు లేదా అందరాని పండ్ల కరుప్రి సాచినటుల వ్యర్థమై హృదయము భగ్నన ప్రజ్వలించున పుడు మానవుడు పొందునవస్థ దుర్భరము, దుస్సహము. ప్రేమ యను రెండక్షరములు గాఢముగ కుడిమొకముల హృదయ మున ముద్రింపబడినపుడు ప్రేమమయి పదార్థము చలనమయి నను జడమయినను ఎంతదవ్వులనున్నను తలపోటుప్రకవాసి చలించి ముల్లువలె చాలకాలము వేదన బొందింపకమానదు. దూరమైననేమి-దగ్గరైననేమి. కావలసినది హృదయము. నిర్మ లహృదయులయెడ నిట్టి సామెత నైసర్గికముగాని కుటిలమాన సులయెడ నిరర్థకము, నిష్ఫలము.

అటులనే నాటిరాత్రి ఏకారణముననో వసంతుని హృద యము సౌదామినీ నీలకంఠులయందు మిక్కుటముగ లాగు చుండెను. ప్రేమలేనిచోట తీయని పలుకులు విషతుల్యములు.

ప్రేమగల్గుచోట కఠోరవాక్కులమృత గుటకలైపోవును. ఇది యే ప్రేమరహస్యమని పెద్దలు వాకృత్తురు. నాటిరాత్రి వసంతుడస్విమితుడై పోయెను. కొంతవడి కలసి అచటనే నిద్రబోయెను. ఆనిద్రయందు వసంతునికొక స్వప్నమయ్యెను.

"వసంతుడు సౌదామినీ కరగ్రహణముచేయునపుడు కాల్‌దేవుడు భీకరాకారముతో నొకకత్తిని గొనివచ్చి వసంతుని యమపురికంప ప్రయత్నించెను. ఇంతలో నీలకంఠుడావప్రత్నముగ్రహించి కాల్‌దేవునిబట్టి బంధించెను. రఘునాథుడు సుకేశినీ కంఠముగోరికి రక్తపానముచేయుచుండెను. సౌదామిని తండ్రినివారింపబోయెను. ఇంతలో విమలసింహుడు, వసతుకుమారుడు రఘునాథునిబట్టి బంధించివైచిరి. కాల్‌దేవుని గూడ బట్టుకొనిరి. తస్కరులచే గొనపోబడిన ధనాగారమునందలి అర్ధభాగము వసంతునికి దొరకిపోయెను. నుసందవెంటనే వసంతునకు సౌదామినిచ్చి పరిణయమొనర్చెను. ఆపరిణయకాలమున పరివారసహితుడై జయసేనుడు సౌదామినిని తస్కరించుకొని కోటదాటిపోయెను.

ఇకనేమున్నది సౌదామినీ వియోగదందహ్యమానహృదయుడగు వసంతుడు హా! చెలీ! సౌదామినీ యిదుగోవచ్చుచుంటినని అరచెను. వెంటనే వసంతుడాళయ్యనుండి క్రిదబడిపోయెను. కనులుదెరచి చూచునరికి ప్రభాతమైయుండెను. ఎట్టయెదుట చంద్రావతి చిరునవ్వునవ్వుచు, యువరాజా స్వప్నముగాంచితివా! అనెను. యువరాజు సిగ్గుపడిలేచెను.

# మాలతి.

## ఇరువదినాల్గవ ప్రకరణము.

### దివ్యసుదినము.

ఇట్లే నాల్గుమాసములవరకందరు నిశ్చింతనీరుబోసిన తెరంగున చల్లగనుండిరి. నాల్గుమాసముల లెక్క యేచటనుండి యని మమ్ము ప్రశ్నింతురేమో, ఏనాడు వసంతకుమారునితో సనత్కుమారుడు మొదలగు వారు ఉదయపురి ప్రవేశించిరో నాటినుండి నాల్గుమాసములు వర్షకాలమగుటచే ఎవ్వరునెట్టి ప్రయత్నములు జేయకుండిరి. వర్షానంతరము వర్షకాలమేఘము లాకసమున నిలువక వెడలిపోయిన పిదప ఒకశుభము వార్త వినంబడినది. ఆనాడు దండయాత్రకు వెడలిన సహజయమను మాట యుండదని వారునిశ్చయించుకొని నాటిదినమున నొక సభగావించిరి.

జయసేను డకాలమరణము నొందినపిదప రాజకుటుంబమున మహారాణిదప్ప యితరులెవ్వరు లేకుండుటచే రాణియు పిన్నవయస్సురాలగు సత్యవతీదేవియనుమతిని సనత్కుమారుడు రాజ్యవ్యవహారములు చక్కబర్చుచుండెను. నాటినుండి మంత్రి యగు సనత్కుమారుని యాజ్ఞకందరులోబడి సెమ్మదిగ సుఖ కాలక్షేపముతో రాజ్యమునడచి పోవుచుండెను.

నాటిదినమున భేరీమృదంగవాద్యములు భూనభోంతరాళముల ప్రతిధ్వనులీనుచుండ సభాభవనము దెరువబడెను.

అందుగలమణిమయ గద్దెపై జయసేనుని కిరీటముమాత్రముంచిరి. అప్రక్క-మరియొక ఆసనముపై సనత్కుమారుడు గూర్చుండెను. ఆమహాలు చాలవిశాలమైనది. నేలనిండ రత్న కంబళములు యున్నతాసనములమర్పబడియుండెను. ఆమహాలునందుగల స్తంబంబులన్నిటికి చిత్రవిచిత్రపు కాయితపుచుట్టులలంకరించిరి. నాటిదినమున ఉదయపురి కలకల లాడుచుండెను. ఇసుకవైచిన రాలనంతటి జనసమూహము జేరి యుండిరి. ఇంతలో యొక గంటారావము వినవచ్చెను.

ఆధ్వనివిని అందరు నానభామంటపమందు ప్రవేశించిరి. వచ్చినవారినందరిని విమలసింహుడు, వసంతుడు గౌరవసూచకముగ వారికున్నతాసనములజూపి వారినందధిష్టింప జేయుచుండెను సింధుమాలనగర ప్రభువగు నరసింహదేవుడు, కళ్యాణిదుర్గనాయకుడగు జయంతుడు, కృష్ణకాళీనగరమునుండి ప్రభాకరుడు, జోధపురమునుండి జగదేకసింహుడు వారివారి సైన్యసమేతులై వచ్చియుండిరి. వారికి తగినవిడుదదులు నేర్పరుపబడియుండెను. మహారాజులు ధీమంతులగు మంత్రివరులు ఇత్యాదివీరులా సభామండపమందుండిరి. సైన్యము కోటకావల భాగమున గల వనములలో నుంచిరి.

ఆసభామంటపమునకు వెనుకభాగముననొక తెరగట్టించిరి ఆతెరమరువున సత్యవతీదేవి, శాంతాదేవి, చంద్రావతి, సత్యవతి

తల్లియగు శారద ఇత్యాది అంతఃపుర స్త్రీలు గూడ వచ్చి యుండిరి.

అంతట సనత్కుమారుడు లేచి సభకు వందనమాచరించి "అమ్మా! ఏమిశెలవని యూరకుండెను. ఇంతలో నొకభటుచే రాణివద్దనుండి లేఖవచ్చెను. మంత్రివరుడాలేఖందిలకించి అందుగల వాంశములు చదువుటకై విమలసింహుని కందించెను. విమలసింహుడిట్లని చదివెను.

అన్నా! సనత్కుమారా! నేటిసభయందు జరుగవలసిన నియమములు నీవె స్వయముగ వెల్లడిపర్చుము. ఏదిఎట్లుజరిగించినను ప్రజలకెంతిమాత్ర మలజడి పుట్టింపరాదు. ఎన్ని యుద్ధములు జరిగినను ఐకమత్యము సభయందుండు సోదరులు గుర్తెరింగి స్త్రీలయెడ వృద్ధులయెడ బాలురయెడ నపచారములు చేయరాదు. దుర్మార్గులను శిక్షించి సన్మార్గులను రక్షించుటకు ప్రజలందరు బూనుకొనుడు. ఇతర రాజ్యాపహారులగు మతస్తుల దరిచేరనీయక రాజు చక్కగ పరిపాలించి మెప్పుబొందదగు ప్రజలకు భాధకరములైన పన్నులు దీసివైచి వారికిష్టమగునటుల పరిపాలింపవలెను. అబలనగు నేనేమిచేయుదును. అన్నిటికి సోదరుడగు సనత్కుమారుడే నడపించుగాక. కొదువసంగతులు మంత్రిచేవి నిపింపనగు—ఇదిమాయాజ్ఞ.

ఇట్లు,

సత్యవతిదేవి.

ఆలేఖను వినినవెంటనే అచటనున్న ప్రతి క్షత్రియుని శరీరము పులకాంకుర మొందిపోయెను. ఎంతమహాయిల్లాలు ఎంతటిదయార్ద్ర హృదయ ఎంతటి మహాతల్లి సద్గుణఖని అని ప్రజలు గుసగుస లాడుచుండిరి...

ఆసద్దు అణగినపిమ్మట సనత్కుమారుడు లేచి నిలుచుండి గంభీర స్వరముతో ఓరాజాధిరాజులారా! మిత్రులారా!

మాజయసేన మహారాజు కాల్‌దేవుడను మ్లేచ్ఛునిచే కృత్రిమమరణముబొందెనని మీరందరెరింగిన విషయమైయుండవచ్చును. అదిమైనపిదప సింహపురీనగరపు యువరాజు, మహారాణి, సునందాదేవిని మంత్రియగు రఘునాథు దశారణ్యావైరముబూని రాజ్యతృష్ణ ధనాగారము నయితము కాల్‌దేవునిచే తస్కరింపజేసెను. యువరాజగు వసంత సింహుని కాల్‌దేవుడు చంపయత్నింపగ వసంతుని మిత్రుడగు నీలకంఠునివలన నర్ధరాత్రిమున కోటయొక్క రహస్యద్వారమునుండి బంపివైచెను. ఇప్పుడా వసంతసింహుడు యిచటనే కొన్నినెలలనుండి యుండిరి రఘునాథుడు ధనాపహరణము గ్రహించినవాడనియూ రహస్యము బయల్పడక పోదని యీవిమలసింహా మహాశయుని నూరిదీయించెను. విమలసింహుడురియెట్లు తప్పించుకొని వచ్చెనో యింతవరకు నేకిని తెలియదు. అది అటుంచుడు.

ఈవసంతసింహుడు, విమలసింహుడు మనక్షత్రియులు మనసహాయసంపత్తిచే సింహపురి నగరమునుజేరి కాల్‌దేవు

నితో ఘోరయుద్ధ మొనరింప వలసియుండెను తత్కారణము చేమిమ్మాల నిటుకోరి రప్పించినారము, మనమందరము, హితులము. సాటి క్షత్రియుని రాజ్య మొక్కదురాత్ముడు లాగు కొనియున్నపుడు మనకుమనమే సహాయసంపత్తి బొందుటమేలు. ఐకమత్యమేబలము. మీమీసహాయ సంపత్తితో మీమీసే నావారముతో నికనాల్గుదినములలో సింహపురిని ముట్టడించ వలసియున్నది. తమప్రత్యుత్తరములకు వేచియున్నవాడ "నని తనయాసనమున గూర్చుండెను. జయంతు 'డులేని" రఘునాధుడే మయ్యెను. రఘునాధునిమాత్రము కాల్‌దేవుడు సంహరించి యుండడా!

సన:—లేదు. రఘునాధు కాల్‌దేవుని చెరయందుండెనని మాత్రము దెలియును. పిమ్మట క్షత్రియులందరు యుద్ధము నకు సన్నద్ధులైతిమని యొక్కకరిసరచిరి. ఉదయపురికి సామం తులైన క్షత్రియరాజులు మాంత్రిశేఖరులు వచ్చియుండిరి ఉద యపురమున రెండులక్షల కాల్బలము, ఇన్నూరాశ్వికయోధులు, డెబ్బదియెనిమిదేనుంగులు, మాత్రమేకలదు. వాటికంతకు ఉగ్ర వర్మను సేనానాయకుని జేసిరి. సింధుమాలనగరరాజు తన వేయి ఏనుంగులతోను పదివేల యశ్వికసైన్యమును నేడువందల పదాతులతోను వచ్చియుండెను.

జయంతు డిన్నూరుగజములతోను, పదునొకండువేల యశ్వికసైన్యముతోను వేయి కాల్బలముతోను వచ్చి యుండెను.

ప్రభాకర, జగదేక శింహుల్వేలు చెరియొక వేయికాల్బ లముతో మాత్రమే వచ్చి యుండెను. కొంతసైన్యము వారి

వారి రాజ్యములందు నిలిపి వచ్చిరి. ఇంకను కొందరు ప్రబల దండవీరు లనేకులుండి యుండిరి.

వారివారి సైన్యమును జక్కఁబర్చునరికి నాలుగు దినములు బట్టెను ఆ నాడు శుభముహూర్త ముందిరి. నాటిదినము మతంగులఘీంకారములతోను, హయహేషలములతోను, కాల్బలముల వీరప్రతాప సంభాషణలతోను, మిక్కిలి సందడిగనుండి యుండెను.

సైన్యమంతయు విమలుని యాజ్ఞప్రకారము నడచునట్లు ఏర్పరచిరి. ఒకపట్టంపు దంతిపై మణిమయ ముత్యాల హౌదీపై వసంతసింహుని గూర్చుండబెట్టిరి. ఐదువందల అశ్వికవీరులు వసంత సింహుని కంగరక్షకులవలె నేర్పడిరి.

ముందు భాగమున జగదేకసింహుఁడు, ప్రభాకరుడు తమసైన్యమును నాల్గుభాగములు జీల్చి చెరియొక రెండుభాగములకు ముందు వీరవిజయసల్లాపము లొనర్చుచు బోవుచుండిరి.

ఆ వెనుక నరసింహ దేవుడు తన సైన్యము నడ్డముగ కదిబారులు దీర్చి నిలువబెట్టించి మధ్యనొక హయముపై నెక్కి పోవుచుండెను. ఆ వెనుక వసంతసింహుఁడు పోవుచుండెను.

కుడిమొకముల మఱికొందరు ప్రబలదండవీరులు, విజయసింగు, ప్రతాపరాయలు, భద్రసింహుడు మొదలగు వారాశ్వికులపై వచ్చుచుండిరి.

ఆ వెనుక జనానాస్త్రీలుండిరి. వారిచుట్టు నిరువదియైదు ఏనుగులు, నలుబది యాశ్వికవీరులు, మూడువేల కాల్బలము

వచ్చుచుండెను. ఆవెనుక సనత్కుమారుఁడు, ఒక ముసల్మాను యువకుఁడు పోవుచుండిరి.

ఈమహాసైన్యమాతయు వెనుకముందు నడపించుచు విమలుఁడతికోత్సాహముతో అశ్వముపై వచ్చుచుండెను.

మరియొక నూతనయువకుఁడు విమలునంటియే వచ్చుచుండెను. జయ్ సుకేశినివసంతకుమారకుజయమని శబ్దముతో భేరీ నినాదములు దిక్కులంపిక్కటిల్ల యొక మహావాహినిబోలు సైన్యమువెల్లఁగ గదలిపోవుచుండెను. ఆవెనుక నినిమిదివందల బండ్లపై తిండిపదార్థములు గుడారములును వాటిని సంరక్షించుచు వేయిమంది కాల్బలమును గూడ బయలువెడలెను. ఇక నేమున్నది.

సనత్కుమారుని ధైర్యసాహస వితరణాదిగుణగణంబులు పెక్కురు స్తోత్రమొనర్చుచుండిరి. పురంధ్రీలలామలు తమసౌధాగ్రముల పైనుంచి లాజలుజల్లిరి. మంగళహారతులు బట్టుచుండిరి. అట్లుదయపురీరక్షకులు మిగిలినవారు గాక మిగిలినసైన్యము సముద్రముమధ్య బోవునావవలె వెడలుచుండెను.

ముసలముద్గర భిండివాలక యాయుధములు తళతళమెరయుచుండెను.

సింహపురీ ముట్టడికై ఈమహాసైన్యము వెడలిపోవుచుండెను. అవివెన్నెలరాత్రులు వెన్నెలరాత్రుల దు తగువైన స్థలముల విడయుచు సింహపురీనగరము పదునారుదినములకు జేరియుండిరి.

---

# మాలతి.

## ఇరువది ఐదవ ప్రకరణము.

### యుద్ధము.

సింహపురీనగరమున కవ్వలిభాగమునగల విశాలమైదానప్రదేశంబున వసంతసింహుని సేనావారమరిగెను.

అచటగల వృక్షములను గొట్టివైచి నేల సరిజేయువారలు కొందరు, తమ హయములకు గజములకు మేతలవేయువారు కొందరు, రాజులునివశించుటకు సైన్యమునకు గుడారములు వేయువారలు కొందరు, అంతఃపుర స్త్రీలు నివశించుటకు కొలదిదూరమున పటకుటీరములు నిర్మించువారునై అందరన్నికార్యములపై పదునైదుదినములలో ముగించిరి. స్థిరమైనయాస్తరణజేసుకొన్నపిదప విమలుని యాజ్ఞచొప్పున కొల్బలమంతయు నూతనాంశములు దెలిసికొనుచుండిరి.

నారసింహదేవుడు మొదలగు యిత్యాద వయస్సుమళ్ళినవారలు పురాణ కాలక్షేపము లొనరించుచుండిరి.

కొందరు ప్రచండ దండనాయకులు యుద్ధోత్తుగ నెప్పుడుబడి శత్రువుల గుండెలు జీల్చుదమాయని వేచియుండిరి. కొందరు యుద్ధనైపుణ్యముల వృద్ధులగువారియెడ నేర్చుకొను

చుండిరి. కొందరు తమకత్తుల మెరగుపెట్టుచుండిరి. మరికొం దరు ఆహారపదార్థములపై పెత్తనములబొంది శాకపాకము౹ జేయించుచుండిరి. ఈమహాసైన్యము బయలువెడలిన మరునాటి దినముననే కాల్‌దేవుని ముఖ్యహితుడగు కాళీభిల్లునివలననెరింగి సింహపురీనగరమునగలకోట నలుమూలల శిధిలమైన తావుల బలపర్చెంచెను.

అగత్యద్వారములు మూయింపకమున్నె యాహార పదార్థములారుమాసములకు సరిపడినవి కోటలో నింపబడెను. ఆరావళి, వింధ్యకనుమలనుండి నాలుగైదులక్షల సైన్యములతో యా దుర్గము పూరింవబడియుండెను. కాల్‌దేవు డుపాయశాలి ధైర్యవంతుడు మహావీరుడగుటచే ఆతని ప్రతి రక్తనాడినుం డియు యుష్ణరక్తము రఘురివేగమున ప్రవహించుచుండెను. బల్లెములు, ఈటెలు పదునగు కరవాలములతో భిల్లసైన్యము యుద్ధసన్నద్ధులైయుండిరి.

వీరబాహు, కుమారభిల్లు, శ్యామలాభిల్లు, కాళీభిల్లు యిత్యాది వీరులు మిక్కుటముగ నుండిరి ఒక్కొక్క భిల్లొక వేయిమంది నవలీల జయింప యుద్ధనైపుణ్యము గలవారై యుండెను. కాల్‌దేవుని హృదయము మిగుల నుత్సాహపూరి తమై పోవుచుండెను. కోటిద్వారములు మూసివైచిరి. తూర్పు దిక్కున వీరబాహుడు పశ్చిమమున శ్యామలాభిల్లు దక్షిణమున కాళీభిల్లు వుత్తరమున కాల్‌దేవుడు దుర్గద్వారముపైగల బురు జుల నతిశ్రద్ధాళువై కాయుచుండిరి.

వసంతుని సేనగూడ నానాయుధపాణులై యుత్కంఠత నొందుచుండిరి ఇంతలో సనత్కుమారునితో భద్రుడను వీరుడు 'అయ్యా సామముచేత కార్యానుకూలము జేయుదమా? యొక వీరుని రాయబారిగబంపుదుమా'? అనెను.

ఆపల్కులు విన్నంతనే సనత్కుమారు డుగ్రుడై మరల శాంతించి. "భద్రా! మనము క్షత్రియులముగామా! వీరుడైనను అడవి జాతివానికి రాయబార మేల పంపవలయును" అనెను.

భద్రుడిక మాట్లాడజాలక ఆతడు క్ష-త్రి-యు-డు-కాదుకాదు క్షత్రియ ద్వేషియని పొరపాటున దలంచితిని క్షమింపుము అని వెడలిపోయెను. ఇంతలో నొక యోధుడచటకువచ్చి యొక కమ్మను సనత్కుమారున కందించెను. ఆత డొక భిల్లుడు.

సనత్కుమారు డాలేఖంగొని ఇట్లని చదువుకొనెను.

సనత్కుమారా! ఏలకాలయాపన మొనరించెదవు. త్వరపడవేల? పదినేను దినములనుండి పిండివంటలతో భోజన మొనర్చుచుండిరా? మహాసైన్యము గొనివచ్చితినని గర్వపడకుము. నాభుజబలపరాక్రమము చవిచూతువుగాని రమ్ము.

ఇట్లు,
కాల్ దేవుడు.

# మాలతి

## ఇరువది ఆరవ ప్రకరణము

### మరునాడు.

మరునాడు కలకల తెల్లవారింది. వసంతుని సైన్యమున భేరీధ్వనులు దిక్కులు పిక్కటిల్లుచుండెను. కిలకిల ద్విజములు రుతము నొనర్చుచుండెను మందమారుతము వీచుచుండెను, దండతాడిత భుజంగంబురీతి యుగ్రుడై ప్రభాకరుడు ప్రభవించుచుండెను. సైన్యసన్నాహము సరికి జాము పొద్దెక్కెను. భయంకరాట్టహాసమున అనంతపరివార సహితుడై యారోజున వసంతకుమారుడుగ్రుడై ముందునకురుకుచుండెను. ప్రతి భటుని నోటినుండి వీరాలాపములు మిక్కుటంబుగ వెలంగె రెండువందల గజయూథంబుల నొక్కసారి మరల శత్రుమద్వారమును దాకించిరి.

పైనుండి భిల్లువీరులు విసరివైచుచుండిరి ఒక్కొక్క బల్లెపుపోటు కొక్క భటుడు కాలధర్మ మొందుచుండెను.

మధ్యాహ్నమార్తాండు డుగ్రుడై మింట వెలుంగుచుండెను. ఆతపము పైనుండి వేడినూనె పనుచునేయుండెను.

ఇంతలో విమలుడొక యశ్వముపైనుండి దక్షిణద్వారమున కొందరు భటులతో నిల్చి సన్నాహవ్యగతి తెలియురా

కుండ బాణవర్షము కురిపించుచుండెను. దక్షిణద్వారమింతలో శీర్ణమయినదని యెఱింగి వెంటనే పడువారాశ్విక యోధులను మున్నది ఏనుంగులతోను సనత్కుమారుఁ డచటకు హుటాహుటినివచ్చి చేరెను. హరహరా! యని భటులు సింహగర్జనంబుల బోలు కంఠధ్వనులు చెలంగ నొక్కపరి అరచిరి.

సాయంకాలారుణరక్తమాలికలు ఆకసమునుండి పుడమిని చుంబించుచుండెను. ఇక నేమున్నది దక్షిణద్వారము పిడుగుపడినంత మహాధ్వని చెలంగ గుండెలవియజేయు పెళపెళమని పర్వతమువలె కూలిపోయెను ఆద్వారము క్రింద చాలమంది అశ్వికయోధులు తమ అశ్వములతో పిండి పిండి అయిపోయిరి.

వెంటనే విమలసింహుఁడు, సనత్కుమారుఁడు, విమలసింహ నంటియున్న వీరుడు వసంతకుమారుడు సైన్యముతో దుర్గమున బ్రవేశించి యడ్డుకొని వచ్చు శత్రుసేనల నురుమాడుచు విజృంభించి అట్టహాస మొనర్చుచుండిరి. వెంటనే దక్షిణద్వారపాలకుఁడగు కాళీభిల్లుకు మదమాతంగంబుపై కురుకు హార్యక్షంబు బగిది విమలుని దాకెను. కోటలో శత్రువులు శత్రువులు అని కోలాహలమై పోయెను.

అంతలో కాళీభిల్లుసహాయార్థమై కాల్దేవుఁడు శ్యామలాభిల్లుగూడ నచట కొక్క పొంటని జేరుకొనిరి దుర్గద్వారము శిథిలమై చూర్ణమైపోయి మార్గమిచ్చినను ఒక్క అడు

గైన ముందుకు జొచ్చుట కవకాశమీయకుండ దుర్గములోని వారలు శూలుల సమూహము విసరుచుండిరి. అన్నిమొదలను కర దీపికావహాస్త్రంబులు వెలుంగ జొచ్చెను జాము రాత్రి అయి పోయెను. వెనుకటి సైన్యము ముందుకుగిదుటకు గాని ముందు సైన్యము లోనికి తోసికొనిపోవుటగాని వీలు కలుగక లక్ష భిల్లసైన్యము హరీ హరీ! ఖడ్గాఖడ్గి పోరుసల్పుచుండిరి. విమలుం డలసిపోయెను. ఆతని శరీరము తూట్లుపడి రక్తమాగుట లేదు. అట్టి విమలసింహుప్పుడు నాలుగువేల భిల్లుల బరిమార్చివైచెను. ఒడలెరుంగక తన యశ్వముపై బడిపోయెను. కాళీభిల్లు విమ లుని బట్టుకొని తనచేతి యందలి కత్తితో పీకకోయుట కుద్య మించుచుండగా ఒక వీరుడు తటాలున కాళీభిల్లునిపైబడి భిల్లు చేతి కత్తి లాగివైచెను. ఇరువురు ద్వంద్వయుద్ధమున డీకొనిరి వెంటనే భిల్లుడావీరుని కంఠమొకచే బట్టి రెండవ హస్తమున ఖడ్గమందుకొని ఒక్కపోటు పొడుచుటకు సిద్ధమై పోయెను. ఇంతలో వీరుడది గ్రహించి తన కత్తితో కాళీభిల్లుని హస్త ము నరికివైచెను. కాళీభిల్లు నేలబడిపోయెను. భిల్లులాతని మృతి కనులార జూచిరి. వీరావేశ తప్తులై ఒక్కుమ్మడి మరల దాకిరి. ఈసరి వారిబల్లెము లతితీవ్రతతో పనిచేయుచుండెను. వసంతుని సైన్యములో భిల్లులు పూర్తిగ జొరబడి పొడుచు చుండిరి. వసంతుని సైన్యము చాలభీతి నొందెను. భిల్లుల తీవ్ర బల్లెపు పోటులకు నిజవీరత్వము గోల్పోవుచుండిరి. ఇంతలో వసంతకుమారుడు సైన్యమును బురికొల్పికొని పొడువుడు పొడువుడు అని హెచ్చరిక జేయుచుండెను.

వసంతుడికి నాగజాలక్ష యెడమచేత డాలును కుడిచేత పదునగు కత్తియు దాల్చి శేళ్ళ ప్రైకురుకు బెబ్బులివిధంబున భిల్లసైన్యమునకునమ్ముబడి అడ్డము వచ్చిన ప్రతి భిల్లుని తునియలుజేసివైచుచుండెను. ఇంతలో నొక ప్రక్కనుండి హా! చచ్చితి చచ్చితినని ఎలుంగు వినవచ్చెను. వెంటనే వసంతుడటుతిరిగెను. ఒక బాలవీరుని క్రింద బడద్రోసి రొమ్ముపై గూర్చుండి తన మొలనుండి కత్తిదీయు భిల్లుని చూచిన వెంటనే వసంతుడతని యంగలని మస్తకము నేల దుళ్ళనేసెను. వెంటనే యా బాల వీరుడు లేచి "యువరాజా నీకృపావిశేషమున బ్రతుకగలిగితిని రమ్ము రమ్ము. సైన్యము వచ్చి పడుచుండెనని వారిరువురు అచటనుండి మరల శత్రువుల దురుమాడుచుండెను.

వసంతుని శరీరమునుండి నెత్తురులు కాలువలు గట్టుచుండెను. వసంతుని వెంటనే బాలవీరుడు మరియొక తాపుకు తన భుజముపైనుంచి తీసుకొనిపోయెను. కొంత శ్రమ వాపుకొని వసంతుడు బాలవీరుని సహాయముతో మరల యుద్ధరంగమునకురికెను. ఆనాడు యుద్ధ మాపు జేయుటకై యాజ్ఞ ఇచ్చుటకుగాని ఆపుటకుగాని ఏకిని వలనుబడకుండెను.

ఈసమర మిచట జరుగులోపల పశ్చిమ ఉత్తరద్వారంబులు బద్దలు చేసుకొని జయంత జగదేక సింహాద్వులు మ్లేచ్ఛులకు వెనుకతట్టునుండి ఘోరముగ కొరుచుండిరి.

మూడువైపుల స్వాధీనమయినదుర్గము మరలపొందగల మాయని మ్లేచ్ఛులునిరాశబొందుచుండిరి. అశ్వములపై ననేక వుద్దండవీరులు దుర్గమునబడి వసంతునికి సహాయభూతులయిరి. కాల్ దేవుని వసంతుడు శ్యామలభిల్లుని సనత్కుమారుడు వీర బాహుని ప్రభాకరుడు కుమారభిల్లుని నూతనవీరుడు శంకర భిల్లుని మరియొకనూతనవీరుడు ఎదుర్కొని ఖడ్గాఖడ్గిబోరాడు చుండిరి. భిల్లులలో పేరుపొందిన మహావీరులుతో రాజపుత్రు లు దలపడి కొండలను గొఱ్ఱెలుదాపినవిధంబున సమర మొనరిం చుచుండిరి. వారివారి ఖడ్గములనుండి కణేల్ కణేల్ మని ధ్వని పుట్టెను. నారశింహదేవుని నొకభిల్లుడుపట్టుకొని కాలుసేతులు గట్టి దూరముగవిసరివైచెను. తెల్లవారుసరికి రాజపుత్రులు భీక రయుద్యమమున మ్లేచ్ఛులను యమపురికంపివైచిరి. శ్యామలా భిల్లు కాల్ దేవునిపట్టుకొనిరి. వారినిమాత్రము చంపక వారి చుట్టు వేయిమందిని కావలియుంచిరి.

భిల్లుసైన్యము వాల్గులక్షలకు నొకలక్షసైన్యముమాత్ర ము మిగిలెను. రాజపుత్రులలో ప్రభాకరుడు జగదేకసింహుడు మరణించిరి. వారిరువురిమరణముకు సనత్కుమార వసంతాదు లు మిక్కిలిగ వరితపించిరి.

దుర్గమతి దుర్ఘటముపై రసపుత్రులఆధీనమయ్యెను. నాటిరక్తప్లాతముపై సూర్యభగవానుని కిరణములు మరింత భీభత్సముగ ప్రభలించుచుండెను.

తిర్గి దుర్గపారిప్రభలపై ననేకులు బూనియుండిరి.

# మాలతి.

## ఇరువదిఏడవ ప్రకరణము.

### ప్రాణాపాయము.

విమలసింహునకు మతిలేదు. ఆతనిరక్తము చాలక్షీణించిపోయెను. శరీరమందంతటను జల్లెడతూండ్లవలె గాయములైపోయెను. ఆతనిహృదయము ప్రపంచముపైలేదు. నూతనాభావము లాతనికిదోచుటలేదు. సర్వము అగమ్యమైపోయెను. అంధకారమందలి పికిలిపిట్టవలె విలవిలతన్నుకొనుచుండెను. తన కన్నులుమూసికొనియుండెను. నిస్సారము మైకముగ గ్రమ్ముకొని వచ్చుచుండెను. ఆతడొక స్వచ్ఛందపాన్పుపై బరుండియుండెను. శరీరముపై వడ్లగింజవేసిన పేలపుగింజయయిపోవుచుండెను. అంతటితీవ్రజ్వరముతో మధ్యమధ్య మూల్గుచు పలవరించుచుండెను. పాలకమహాశయా అటుజూడుము ఏదియోపలుకుచున్నాడు. "హా! దుర్మార్గా! కాలదేవా! ఛీ! ఛీ! రఘునాథా! రఘునాథా! నన్నురిదీయించిననాటివఱకు నేడు......అయ్యో! ప్రాణ—కాంత—చంద్రావతీ—నీవు—లేకుండిన మరల నిన్ను జూచుభాగ్యమబ్బునా రన్యులనన్యులు బట్టుడు—కొట్టుడు. ఆ! ఆ! ఎంతతీవ్రమైనపోటుపొడిచితివి. హా! అయ్యో! అని పల్కు—అకటకటచిమ్ముచపముమైయుండి క్రిందికిద్రొల్లిపోయెను. అత—

నేయున్న చంద్రావతి విమలసింహునిలేవనెత్తి "నాథా! నాథా! ఏమట్లుకలువరించెదరు. ఇదియుద్ధభూమికాదు. యుద్ధమయునిదుర్గము మనకేస్వాధీనమయ్యెను"అని యతని వదనముల బట్టుచుండెను. ఇంతలో వసంతకుమారవసంతసింహులాది రాజపుత్రులువచ్చియుండిరి. చంద్రావతిలేచి నిలుచుండి "అన్నా! నేడు జ్వరతీవ్రతధికమైపోయెను."అనెను.

"అమ్మాయీ! భయమువలదు అనెను.

విమలసింహుడు కనులుదెరచిచూచుచుండెను. బలహీనత రక్తస్రావమయిపోయినందున వచ్చినవారిని గుర్తింపలేకపోయెను. అందరు విమలునిచుట్టుమూగిరి విమలుడంతట హా! శత్రువులు శత్రువులు వసంతా నిరాజ్యము నీకిచ్చెదనని చేసిన వాగ్దత్తము వ్యర్థమైపోవునేమో నేను నీసేవకుని. వసంతా రాకుమారా! అరుగోభిల్లులు కత్తి కత్తియని మరల కన్నులుదెరిచియే మాట్లాడెను. వచ్చినవారంద రాతనికి సంధియని తెలుసుకొనిరి. ఇంతలో నొక బాలయోగి యచటకుజేరి కొన్ని ఆకుపసరులు విమలునిచే మ్రింగించెను. ఆరాత్రి విమలసింహుడిక జీవింపజాలడని ప్రతివారును మిగుల విచారహృదయములతో తహతహలాడుచుండిరి. ఆరాత్రి యెవ్వరును నిద్రింపలేదు. అందరును నిరశతో దగ్గుత్తికతోనుండిరి. అందలికనులనుండి అశ్రువులు జలజలరాలుచుండెను. బాలయోగి మరల నొక మూరుషౌషధసేవజేయించెను. తెల్లవారవచ్చుచున్నది. తూర్పురేఖలు నలుదిక్కులు ప్రసరించి గాఢమగు తిమిరముల బారదోలుచుండెను. వేగుచుక్క ప్రకాశమానముగ వెలుంగుచుండెను. చక్కని గాలివీచుచుండెను. దూరమునుండి సారమేయములు పోరాడుచుండెను. దుర్గమును గాయు సైన్యము విమలసింహుని దుతిక్షి

చెప్పుకొనుచుండిరి. "ఈవుదయము సూర్యోదయమగువరికి విమ
లసింహుని బ్రతుకునూ లేదా? అట్టితరుణమునకే ప్రాణవాయు
వులుపోవచ్చును." ఏదిఅయినను బాలభానోదయముతో నా
ధారపడియుండెనని బాలయోగి కొంచెము చాటునకుపోయి
భోరుని యేడ్చుచు అచటనే నిద్రించెను. వసంతునికి తగిలిన
గాయములు అంతగబాధించినను లెక్కజేయకయే తిరుగు
చుండెను.

సనత్కుమారుడు వసంతునిచే కొన్నికసరుమందులు
రాయించెను. వసంతునిరక్తముపోలేదు అట్లుగాక విమలుని
శరీరము జల్లెడతూట్లచే విమలునిస్థితి దారుణసంఘట్టనమున
మునిగిపోయెను. ఇంతలో బాలభానుడుదయించెను. వెంటనే
అందరు విమలునిశయ్యచుట్టు నిలుచుండి చూచుచుండిరి. విమ
లుడొక్కప్రక్కనుండి మరియొక ప్రక్కకుదిరిగెను. గాఢముగనిద్ర
బట్టియుండెను. ఆయుదయమున జరుగనున్న దారుణము పరా
త్పరుని యనుజ్ఞచే దప్పెననియెంచి అందరుగలసి యోగజగదేక
మూర్తి నిర్గుణుడు సూర్యనారాయణమూర్తిని కోనోళ్ళగొని
యాడిరి. విమలసింహుని కారోజుకన్న కారోజుశరీరము స్వస్తత
చెందుచుండెను.

పూర్తిగ ఆరోగ్యస్నానమాచరించునరి కొకమాసము
దినములుబట్టెను అంతవరకు సనత్కుమారాదిరాజులు సైన్యము
అచటనే సుఖకాలక్షేపమొనరించుచుండిరి.

# మాలతి.

## ఇరువదిఎనిమిదవ ప్రకరణము.

### మోహము.

హా! సౌదామినీ! సౌదామినీ! నీసుందరవదనారవింద దర్శనమబ్బి ఎంతయోకాలమయిపోయినది. ఆనాటినుండి నాహృదయమున కింతమాత్రము నెమ్మదియు, సుఖమునను మాటలేదుకదా! వికసితపద్మంబుబోలు నీముఖపద్మము పసివాడిపోయినదా! కట్టా! ఎంతటిపాతకుఁడనైపోయితి. నీకొఱకు గదా పడరానియిడుమలంబడి కొండలవెంట, గుట్టలవెంట, నదులవెంట, పట్టణంబున పడరాని యిక్కట్టులనుబడయజేసిన నీతండ్రి శిరస్సువేయివ్రక్కలుజేయవలసినదే కాని నీయందున్న మోహపాశము త్రెంపుకొనజాలక అప్పటి కచేతనుఁడనైపోయితిని.

ఆగర్భశ్రీమంతురాలైన మదీయజనని కడగండ్లుపడిపోయెనుగదా! సుందరీ! ఇప్పటికన్నియు నించుమించుగ నెరవేరినవియైపోయెనుగాని నీముఖావలోకనము గగనకుసుమసదృశమైపోయెను. ఎండమావులరీతియయిపోయెను. ఒక్కమాసము దినములనుండి నేను సుఖించుచున్నవాఁడనుగాని నీవెన్నియిడుమలబొందుచుంటివో ఎక్కడనుంటివో జీవించియుంటివో లేదో పరమేశ్వరుడు నానుదుటివ్రాతయెట్టుల లిఖించెనో తెలియరాదుగదా! సజీవివైయుందువేనిన్నేళ్ళుగతించినవెనుకనైన నను జూడబుద్ధిబుట్టియుండదా!

ఏమో! ఏది యెటులజరుగునో సౌదామినీ! నీజన్మమధ్య మునఁజూడగల్గుదునా? ఏమో! నాకీయిహసౌఖ్యములు కల్లలై పోవును.

సౌదామిని లేని నాకీ రాజ్యమేల? ఈవైభవమేల? ఈశృంగారవిహారము లేల? అనిపరిపరివిధంబుల హృదయము నీరయిపోవ గుండెలంతతహతహగొట్టుకొనుచుండ వసంతసింహుఁ డొకనాటిపండువెన్నెలలో తనసౌధాంతరమున సుమాంకుల్ గుడ్డపరచిన పట్టుపాన్పుపై పవళించి కంటతడిపెట్టుకొనుచుండెను...... కొంతవడి కట్టులే గాఢనిద్రబట్టిపోయెను. అతఁడొక స్వప్నమున బడిపోయెను.

సౌదామినికొండగుహాలలో నిలుచుండియుండెను. అచట సౌదామినిని దూరమునుండిజూచి వసంతుఁడు కరుగెత్తెను. వసంతుఁడాకొండదిగువభాగమున నిలిచి 'సౌదా! సౌదా! రమ్ము నేనువసంతుని యిటుజూడుము' అనియెలుగెత్తి పిలిచెను. సౌదామిని జగన్మోహినియై నిలుచుండెను. ఆమెపయ్యెద చెరగంతో సమీరకుమారుడు మెల్ల మెల్లగ నాటలాడుకొనుచుండెను. ఓచక్రవాకస్తనీ! యని వసంతుఁడు మరలపిలిచెను. ఆమెనుండి దివ్యతేజము వెలుంగుచుండెను. వసంతునికన్నులు మిరుమిట్లుగొలిపెను.

అంతట కొంతవడికి సౌదామిని వసంతునిజూచి "వసంతా! వసంతా! ఏమనుచుంటివి రమ్మనియా? రాను రాను. నీ పేరుమాత్రము వసంతుఁడనియెఱుంగుదును. నిన్ను గాఢాంధకారములో బడద్రోయుచుండ నేనురాను" అనెను.

వసంతుడు తలపైకెత్తి 'సౌదామినీ! నీకొరకు దుష్ట హాకష్టజాలముల నెదుర్కొని తిరిగి రాజ్యము సంపాదించితిని నీకును నాకునుగల మైత్రి మరువకుము. ఇక పరిణయమే మిగిలి యున్నది. నేడు మనకిరువురకు వివాహము. క్రిందికిదిగిరమ్ము" అనెను. సౌదామిని వసంతా! ఎంత వెర్రివాడవు. నీవు పున్నాగుడవు. పున్నాగునిపరిణయమాడిన నలువురు పరివారలు నవ్వ రా! నిన్ను పెండ్లియాడను. ఆడను.

నేనొకయావకుని ప్రేమించితిని. పరిణయమవును. ఈకొండపై ఈలతావితానములమధ్య ఈజలతరంగిణుల పల్లవుచర్య లలో ఈమాధుర్యమయిన పక్షుల కిలకిలా రావములసందున సుగంధవృక్షములపొంత ఈకొండమల్లెలక్రింద నాకునీయువకునితో నా? వరించిన సౌందర్యమూర్తితో వివాహమాడుదును. నీవుపొమ్ము పొమ్ము. నీయాశవీడుము. ఎంతయో కాలమయిన నన్నుజూచి నాకష్టములదొలగింపనిచ్ఛగించనివాడవు నీతో నాకేమియు నగత్యములేదు పొమ్ము అని భీకరముగాపల్కెను.

ఆపల్కులువిన్నవెంటనే వసంతుని నెత్తిపై పిడుగుపడి పోయెను ఆతల వేయిభిన్నములయ్యెను. ఆహృదయము తామరాకునందలి జలబిందువై తపతపకొట్టుకొనుచుండెను. కొంత హృదయావేశముచల్లార్చుకొని "సౌదామినీ! ఎంతమాటపల్కితివి. దయలేదా! పూర్వముంకి మనస్సేకాలత్రెంపివైతు నా? అన్యాయము. నిన్నుభగవంతుడుమెచ్చడు. నీయీమహాపాపము నకు నిష్కృతిలేదు. అనికన్నీరు కాలువలై పార బిగ్గరగానేడ్చెను.

సౌదామినిహృదయము పాషాణమో వజ్రమోగాని కరుగలేదు. అంతట సౌదామిని ఒక్క పూలదండ వసంతునిపై విసరివైచెను. వసంతా! వసంతా! నీజీవితకాలమువరకు యీ వాడనిపువ్వు సరమిచ్చితి. ఇది సౌదామినీప్రేమసూత్రమని దెలుసుకొనుము పొమ్మనెను. వసంతుడు పరాకెజెంది "సౌదామినీ! ఇదిగో నీయెదుట నిప్రత్యక్షముగ నా శిరస్సుభిన్నముగావించుకొని ప్రాణమువీడుచున్నాను. ఈనింద నీయందెమిగిలియుండునుగాక" అని యొకపెనుశిల పైకెత్తెను.

తలయెత్తి సౌదామినివంక జూచెను. సౌదామిని యొకబాలయోగిహస్తముబట్టుకొని కిలకిలనవ్వుచు అటనుండివెడలి పోయెను.

వసంతు డామహాశిలతో తనశిరస్సును గొట్టుకొనెను. అంతట మెలకువగలెను. విభ్రాంతుడైపోయెను. తనకన్నుల తానునమ్మజాలకపోయెను. ప్రాతఃకాలమందలి వందిమాగధులగీతములుపాడుచుండిరి. పరాత్పరుడగు సూర్యభగవానుడు తనసహస్రకిరణములలో కొన్నిటిని వసంతునిలెపుటకై పంపియుండెను. పికకోయిల రసాలవముపైనుండి తీయనిగానమొనర్చుచుండెను. స్వప్నమని వసంతుడు తెలుసుకొనెను.

ఈస్వప్నముయొక్క భావిఫలమెంతఅనిష్టమొదవించునో అని శయ్యపైడెను.

# మాలతి.

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

### సౌదామిని.

సింహపురీనగరము నేడువింతసోయగము వీచుచుండెను. ఎచటదిలకించిన పరివారమే. ఎచటగనుగొన్న పందిరులును ముత్యాలజాలరులు వరుసగతోరణములుగ గట్టువారలే. ఆ పందిరులయందు పన్నీరు కొందరుజల్లుచుండిరి. రంభాతరులాపందిరులకు సహజముగపుట్టినట్లు నేలనాటుచుండిరి. ముఖమల్ గుడ్డలు పందిరుల కడుగుభాగమున గట్టుచుండిరి. ఆనాటిరోజున పురంధ్రీలలామలను త్వరపెట్టి ప్రతివారుభోజనములముగించుకొని కోటకుబోవుటకు సన్నిద్ధులగుచుండిరి. కోటయందుగల సభాభవనము మరల నలంకరించిరి. మాణిక్యకాంతులనీను కట్టుకరుపులు భవనమునకు నలువైపుల వున్న ఆసనములపై సమర్పించియుండిరి. సభ నలుదిక్కుల మకరరత్నమణిమయ సింహాసనమునకు తోరణముల నలంకరించిరి. పైభాగమున మంచిముత్తియంబులుగూర్చికట్టిన ఛత్రము మిలమిలమెరసి పోవుచుండెను. పవలురెండవయామమునకు కొంచెముముందు ముహూర్తముంచబడెను. ఆశుభముహూర్తమునకు పరిజనులు

పరివారము రాజకీయయుద్యోగులు విచ్చేసి సభముందుగల చలువపందిరులక్రిందనిలుచుండిరి.

భద్రగజంపుపై నొయ్యారముగ శుభచిహ్నముమెరయ వసంతసింహుడు పురమూరేగి కోటముందునిలచెను. పురంధ్రీల లామలు తమబాలరాజుపై సేసలుజల్లి మంగళహారతులనిడిరి. మంగళతూర్యారావములతో బ్రాహ్మణులు స్వస్తి పుణ్యావాచనముతో వేదఘోషచెలంగ దేవేంద్రుని బురిడించుమహావైభవోపేతుడై కుమారవసంతసింహుడు జనులకు ఆహ్లాదమొనరింపుచు చిరునగవు వెన్నెల నలుగెలంకులబర్వజేయుచుండెను. సభాద్వారము ముంగిటగల యున్నతాసనమున తెరమరంగున సునందాదేవి బీదలకు నవరసులుపంచియిచ్చుచుండెను.

ఇంతలో ఘంటారవము వినవచ్చెను. వసంతునిచుట్టు బ్రాహ్మణబృందము శుభసూచకముగ మంత్రపఠనలచే ద్వారమునందు కుడిపాదముపెట్టించిరి.

సభయంతయు కలకలమని శృంగారము, గభీరప్రశాంతము, జేనిత్యము, విజయములతో నిమిడియుండెను.

వసంతసింహుడు శుభలగ్నమున సింహాసన మారోహించెను. జయాభవ విజయీభవ యని భట్టుమూర్తులు దీవించుచుండిరి. జయజయధ్వనులు దిక్కులుపిక్కటిల్లుచుండెను.

వసంతుడు కొంతవడిజరిగినపిదప విమలసింహుని సన్కుమారుని ఇత్యాదిమిత్రుల మహాయోధులనందర సన్నిహితులకన్పానించి విప్రులకు అనేకరత్నాభరణములు దానమొసగి

గను. కవివరేణ్యుల కర్ణాహారములు గండపెండేరములచే ఉపహారించిరి.

భట్టులను తగురీతిని సత్కరించిరి. ప్రజల వల్లనివల్కల చే ఆదరించిరి. సభయంతయు మహానందముతో నిండిపోయెను. అందరిహృదయములు హర్షాంబుధినోలలాడిపోవుచుండెను.

ససత్కమారాధియోధుల యభిప్రాయములు దెలసికొని వసంతసింహుడు విమలసింహుని తనక్రింద మంత్రిపద విచ్చెను. సభయంతయు నిశ్శబ్దతవహించినపిదప వసంతునాజ్ఞపై కాల్ దేవుని, శ్యామలాభిల్లుని సచటకుగొనివచ్చిరి.

విమలసింహుడు రాజాజ్ఞానుసారమున కాల్ దేవునిజూచి కాల్ దేవా! నీపాపఫలమనుభవించుటకు సిద్ధముగనుంటివా అనెను.

కాల్—తలవాల్చి "మహారాజా! నిశ్చయము. నీవు రాజువు. రాజ్యచక్రము నీయందున్నది. మోటజాతివాడనైన నన్ను యుద్ధరంగమందు చంపక యీనలుపురియెదుట యొందు కీడ్చుకొనివచ్చితివాయని విచారింపుచుంటిని. మరియు నాదోషములున్న క్షమింపుడు. రఘునాధునియాజ్ఞపై ధనాగార మపహరించితిని. రాజ్యకాంక్షచే రఘునాధునే వంచించితిని. నా హక్కుగానిరాజ్య మవలీల నారువత్సరములే పాలించితిని. సౌదామినిగురించి జయసేనుని మోసగించి చెరయందుంచి చంపించితిని. నానేరములకు పాపములకు నిష్కృతిలేదు. నా హృదయము పశ్చాత్తాపముచే అనలములేకనె భగ్గునమండిపోవుచున్నది అనెను. నీజనకునికి రఘునాధుడాదేశంబున విష మిచ్చివైద్యముచేసిచంపిన మహాపాపుడనునేనే.

వసంతు—మరియెవ్వరినైన నీదుర్గము బలినొసంగితివా.
సింహపురీముట్టడియైనపిదప యచట చేపట్టిబాధించిన నొకకాంతను తప్పించితిని. ఆమెను కొన్నిమాసములు మాభూగృహములోదాచితిమి ఆమెమిక్కిలి చతురురాలు. ఎట్లోమాయుద్ధప్రయత్నము లెఱింగించుకొనియుండెను. తరువాత అచట భిల్లాంగనలతో మైత్రిజరిపి యొకమచ్చికపావురముచే రఘునాధునికి లేఖవ్రాసి పంపనుంకించెను. అదిగని యాపావురమును నేనుచంపివైచి నీమెను యుద్ధానంతరము బలినీయయాజ్ఞజేసి మేము సింహపురిపైదాడివెడలితిమి. తరువాత జరిగిన వృత్తాంతములు మీకు తెలియును.

పిమ్మట నాబలిసమయమున విమలసింహుడు వసంతకుమారుడు జయసేనునికొరకై వెదకుచు నచటిదృశ్యముగాంచి ఆమెను రక్షించి నాభటులనుపరిమార్చివైచిరి. అంతకుమున్నే ఎందుకైనమంచిదని ఉదయపురి ముట్టడింపుటకై యత్నముచేయుచుండగ మాభిల్లులలోనొకడు ముందు జయసేనుని చంపమని వేడెను. అందుచే జయసేనుని మృతి ఆయింతివలన వారలువిని దుఃఖించి తమతావుల వెడలిపోయిరి. మాగూఢచారివలన విని యుంటిని.

వసంతకుమారుడు కాల్దేవుజూచి, "ఓపీనుడా సౌదామిని నేమిచేసితివి"

అచటివారలమోసగించి సౌదామినియెచటకో వెడలిపోయెనని తరువాత దెలిసినది.

ధనాగారమేమైనది.

"అట్లడుగుము. ధనాగారము నామందిరమున భూగతమొనర్చితిని. మీరలే తెంచి స్వీకరింపుడు.

"మంచిది. నాయందుచాల నేరములుగలవు. రాజా! ఈకాల్ దేవుని ఏమిశిక్షవిధింతువు.

"వసం—మరణమే. అంతకంటె నేమున్నది.

అనిచెప్పుచోవల కాల్ దేవుడు తనముఖముపైనున్న రంగును తుడిచివైచికొనెను. కోటిసూర్యప్రభా మానమగు ముఖమండలమందరు జూచుచుండగా "ఓవసంతకుమారా! ఇక నేనెంతయోకాలము జీవింపను వజ్రమును మ్రింగితిని. నేను క్షత్రియుడను. ఔరంగజేబుకాలములో ఢిల్లిలో మానివాసము. మామేనత్త అల్లుడగు రాజామానసింహుడు మాపై నకారణ వైరముగాని మమ్ము అడవులకు వెడలనడిపెను. నాతాత వీర ప్రతాపసింగు. నాతండ్రి విజయసింగు. విజయసింగు అడవులకు బోయిన వెంటనే మృతినొందెను. మాకుటుంబమున నెవ్వరైన బ్రతికివున్నయెడల వైదర్భకు ముఖ్యవారసులగునని మానసింగు నన్నుగూడ చంపజూచెను. మేమువెడలిన కొన్నిదినముల కా తని కాయూహజనింపనోపు. అదివిని నాతల్లిమిక్కిలి వాపోవగా నేను వేసముమార్చి కొందరిభిల్లులను స్నేహముచేసి వారిచేరి కయైయుంటిని. నా కాల్ దేవి ప్రభావముచే నాయాజ్ఞ కెదురు లేకయుండెడిది. అట్లు నేక్షత్రియుడగుటచే రాజ్యకాంక్షకలిగి యుండెడిది. అప్రయత్నముగ రఘునాథుడు నాకన్నులబడెను. రఘునాథుని నామంత్రప్రభావముచే కట్టివైచి తుదకు యీ ఘోరములనొనర్చితిని." అయ్యో - బాధ - బాధ వసంతా! క్షమింపుము.

ఇదిగో ఈశ్యా-మ-లా-భి-ల్లే-ర-ఘు-నా-ధు-డు పిదప ఈయుద్ధమున దోడుకొనితెచ్చితిని. నాపేరువిక్రమసింగురామా-రామా-హా-అని తన ప్రాణవాయువులవిడెను.

పిమ్మట రఘునాథునిజూచి ఛీ ఛీ యనిరి

రఘునాథుడు మొగమునకత్తిపోటుకైన నెత్తురుచుక్క లేకుండపోయెను. రఘునాథుడు రాజసింహాసనమునకు నమస్కరించి "రాజా! శ్యామలాభిల్లుచెప్పినసంగతి అంతయునిజముం విఁయుండిరి. కాని యాతడు జాతముచే క్షత్రియుడని జెప్పియుండుట ఆశ్చర్యమైనది ... ...

వసం—నీకుమార్తెను జయసేనునికి పరిణయమొనర్చియుంటివి కాబోలును. పాపము! మీకెంతగతిపట్టెను. పువ్వులమ్మినయూరనే కట్టెలమ్మికోవలసినగతి యిదియేగదా యని నవ్వెను.

రఘు—రాజా! వసంతా! నీవున్మాదుడవని నిరాకరించితి. ఇంతటిగుణగణంబులు మొదటనేయుండిన నింతఅనిష్టము గలిగియుండకపోవును. మిగిలినదేమి? మిగులనున్నదేమి? అంతయుఈశ్వరమాయను. పశ్చాత్తాపహృదయుడనైతినిగాని ఒకసందియముగలదు కోరుకొనద ననెను.

వసం—మంచిది.

"విమలసింగెటుల వాటితూదప్పించుకొనెనోయని తలంచుచు ఆశ్చర్యపడుచుంటిని. నాకుమార్తె బ్రతికియుండిన కన్నులకరవుదీరజూచి ప్రాణములబాయుదును." అని కన్నీరు చేలాంచలముతో తుడుచుకొనుచు తనముఖమున బూయబడిన రంగును దుడిచికొనెను.

రఘునాథుడే—రఘునాథుడేయని ప్రజలించుక భీతినొందిరి.

కొందరుపీఠులు రాజసింహాసనము వెనుకప్రక్కఁ గూర్చుండిరి

అంతట విమలుండు లేచి "రాజా! వసంతకుమారా! రఘునాథుఁడొకనాటిసభయందు నన్నుదూలనాడెను. నాటినుండి నాయందు మత్సరముఁబూనియున్నాఁడు. పిదప ధనాగారము కొల్లఁబోయినవెంటనే యెవరివలన ధనాగారమపహరింపఁబడినదో నేనుదెలిసికొంటిని. ఒకటిరెండుపర్యాయములు అర్ధరాత్రి యీకొండలకుఁగూడఁబోయియుంటిని. ఈసంగతియంతయువిని నాయందనుమానము వహించి నన్నుకారణముగ కారాగారమందుంచివైచెను. తెల్లవారునఱి ఉరికియాజ్ఞనొసంగెను. నా వృద్ధమాత కారాగారమునకువచ్చి యెంతయో విలపించివెడలిపోయినపిదప నామెను రఘునాథుఁడే బలవంతముగ నీటఁద్రోయించిచంపెనని యిటీవల దెలియవచ్చినది.

నాఅంత్యదశవచ్చినదనిగ్రహించి మిగుల విచారచేతస్కుఁడనై విచారించుచుండ కొలదికాలముక్రిందట ఈనగరమున జోశ్యము జెప్పిన జగన్నాథజోశ్యులవారు నావద్దకేతెంచి ''విమలసింహా! నేనుక్షత్రియుఁడ నారాయణసింగను నాతని పుత్రుఁడ చిన్నతనముననే తండ్రిచే వెడలనడపఁబడి అడవులకుఁ బోయివచ్చితిని. నాకుమార్తె చంద్రావతి. ఆమెకు దిక్కులేక జయసేను పరాభవింపనెంచఁగా ఆతనిఁదప్పించుకొని యేకాకియై యిచట సుకేశినియను నామముతో మెలంగుచున్నది. నాకాలము మీరిపోవుచున్నది. నీకురితప్పదు. కావున పిన్నవయసుఁ

డవగు నీవుచనిపోవుటకంటె నేబోయినమేలు. అని ఆగి తన అంగీనుండి యొకకమ్మబైటికిదీసి మరలచెప్పుచుండెను. అని కొన్నిప్రమాణికములు నాచేజేయించి యిరువురిభటుల సంహారించి నాదుస్తులు తానుధరించి నన్నుబంపివైచెను. నేనెంతవేడినను నామాటత్రోసివైచి నాకూతునిసుఖము నీపయినిడిపోవుచున్నాను. ఆమెకు లేఖందజేసి పరిణయమాడుమని వెడలిపోయెను.

నాకొరకై చనిపోవుచున్న నామామనుగురించి కడుంగడువగచితిని యేమిలాభము.

మరునాడు చీకటియింకనుపోనివేళ యీరఘునాథుడు నామారుగ జగన్నాథజోస్యులవారి నురిదీయించెను. నేను తెల్లవారుసరికి చాలదూరముపోయి మారువేషమున హృదయపురిజేరి సనత్కుమారునిస్నేహము సంపాదించితిని. పిమ్మటవృత్తాంతమునీకేదెలియును.

రఘు—విస్మయముతో యొంతపనిజరిగినది. పిమ్మట ఇరువురుయువకు లశ్వములపైవచ్చి "అంతయు పూర్తియైనదా" యని కన్నీరువిడుచుచుబోయి యుండిరని వింటిని వారెవరైయుందురు?

ఆసభయందుజేరిన బాలతొూగిలేచి రఘునాథా! ఎవరైననేమి. నాపాపము పండినది. నాకుమారై సౌదామిని నీలకంఠులు అయియుండిరి.

అంతలో రఘునాథుడు తన యొరనుండియున్న కటారు

నీవలకులాగి ఒక్కపోటు రెప్పపాటుకాలములో గొంతులో పొడుచుకొని ప్రాణమువీడెను.

బాలయోగి తటాలున రఘునాథుని శరీరముపైబడి కొంతవడికి దుఃఖించెను.

రఘునాథుని పాపఘటము పటాలునపగిలి సహస్రవ క్కలై పోయెను.

ఎవడు తన నిజపుత్రికామణిని తగని వెతలనుండ జేసెనో, ఎవడు తనప్రియస్వరూపిణియగు నిజభార్య గతించినను నరకుగొనక నడచెనో, ఎవడు కాల్దేవుని మాయాజాలముల జిక్కి తుదకు సర్వమును హరింపజేసుకొనెనో, ఎవడు చక్రవర్తి కాదలచి తుదకు హీనస్థితినొందెనో యట్టి విషవృదయుడు కుటిలాత్ముడు రఘునాథమంత్రి యీపాపనరకమువీడి స్వర్గము జూరకొనెను.

# మా ల తి.

## ముప్పదవ ప్రకరణము.

---

మరునాటిసభ గతదినమువలెనే కలకలలాడుచుండెను. రాజబంధువులు, రాజోద్యోగియులు, అంతఃపురస్త్రీలుఁగూడ నాసభయందలంకరించిరి.

అంత టొక నూతనవీరుడు లేచి ముకిళితకరకమలుండై విమ లునిజూచి "అయ్యా! నిన్నటిదినమున రఘునాథమంత్రి మిమ్మ డిగినప్రశ్నలకు మీరు ప్రత్యుత్తరంబిచ్చు నవసరంబున జగ న్నాథ జోతిష్కుడిచ్చిన లేఖనుగురించి చెప్పుచుండగా నాటం కములుఁకలిగి మరల సద్దానిజదువుటమానివైచిరి. వినిపింకదగు సంశయమేయగునని నాయుద్దేశము. కావున నాటిలేఖవృత్తాంత మించుక దెలియజేయ ప్రార్థితుడ ననెను.

వెంటనే విమలసింహుఁడొక లేఖందీసి యిట్లని చదువ దొడంగెను.

"విమలసింహా! నేను నారాయణసింగు కుమారుడను. నారాయణసింగు ఉదయపురి ప్రధానమాత్యుడు బుందే లులయుద్ధమునకు పూర్వమునాకు వివాహమయినది. బుందేలు లయుద్ధము ప్రారంభించునరికి నాకొకకుమార్తె బుట్టియుండెను.

ఆమెబుట్టిన మాసము దినములకు నేనుయుద్ధమునకు కతిపయప
రివారముతో బోయియుంటిని బుందేలువీరశృంగుని చెల్లెలు
జయసేనను ఒకనాటియుద్ధమున జూచియుంటిని నాటిరాత్రి
మారువేషమున జయసేన పటకుటీరమునకుబోయి యామెరూ
పముజూచి యామెనుమోహాంధుడనై నావశమొనర్చుకొంటిని.
బుందేలులతోయుద్ధముచేసి వారిని నొంప నాకిష్టములేక తటస్థ
ముగ వారికి మార్గమిచ్చియుంటిని. అందుపైవారు వుదయ
పురిపాలనలోగల హుసేనునగరము ముట్టడించిరి. నాతండ్రి
గూఢచారులవలన నాసమాచారము వినియుండెను. కోపారుణి
తనేత్రుడై నన్నుజేరి నిష్ఠురవాక్యములాడెను.

వెంటనే యౌవనమదంబున యావల్కులు సహింపచా
లక వెడలిపోయితిని. నాజన్మమధ్యమున నుదయపురిదొక్క
చూడనంటిని నాప్రతిజ్ఞ నిలువబెట్టుకొంటిని. వెంటనే జయసే
నునిజేరి నాల్గుమాసములుండునరికి బుందేలచక్రవర్తి నన్ను
చంప కత్తిదూసివచ్చెను. అసమానపరాక్రమోపేతుడైన నేను
వానికీడు దీయలేదు. ఆకత్తితో తనచెల్లెలి జయసేనను పొడిచి
వెడలిపోయెను. ఇకనాకేమియు గత్యంతరములేక జయసేన
కొరకు పరితాపమొంది విరక్తుడనై యరణ్యములకు బోయి
యుంటిని. నేటికి దేశములన్నియు దిరిగిన పిదప వృత్తాంతము
దెలిసికొంటిని. నాకుమార్తె జయసేనునుండి తప్పించుకొని
యారావళి పర్వతప్రాంతములనుండి ఇచటకు చేరియుండెను.
అచటనుండియు నామె నరయుచుంటిని. నాకుమార్తెయున్న

బాహ్యాదయము దొంగిలించుచుండగా గణితమేసి చూచితిని. రక్త పంబంధముండి యుండెనని గణితమువల్ల దెలిసినది పిదప నాకు నాజోశ్యము వినుటకు వచ్చియుండెను. నాటిరాత్రి ఒకరినొకరు కౌగిలించుకొని చాలవరకు విచారించితిమి అంతయు ముగిసిపోను న్నది. నాకుమార్తె ఈపట్నపు మహారాణి పరశదేవికిని సోదా మికిని చెలికత్తెయై కాలముబుచ్చుచుండెను. ముందునాకొక దారుణసంఘటనము జరుగనైయున్నది. అల్లది నాపీనులార విన జాలను. ఆసంఘటనము నీవలన బాసిపోవ నున్నదని నాహృద యకుహారముల వేనోళ్ళచాటి చెప్పుచుండెను.

విమలసింహా నాకుప్రపంచముపై నాశలేదు మరణింప యుత్సాహ మొదవుచుండెను. కావున ఒకవీరుని రక్షించిన నీనామము యావజ్జీవముదలంచుకొనునని వేచియుండ నీయుకార ణయుక్తి పిలిటిని. కావున విమలసింహా నీకైనేను చనిపోవు దును ఇదితప్పదు బ్రహ్మలిఖితము ఎన్నటికైన నాగతిలేని పుత్రికను నీవుస్వీకరించితేని. నేనానందముగ నీయుకిబాల్య డుదుకు "ఈకమ్మ నాపుత్రికకు జూపు"మని చెప్పినేను వలదని వేడుకొన్న వినక నాదుస్తుంధరించి తనకుమార్తెకై తానాయురి పొందెను. నేనెంతయో విచారించితిని. దైవఘటన యట్లుండ నేమిచేయుదునని వలెక్రను.

మొదలునరికిన వృక్షమువలె హా! జనకాయని యావీ రుడు క్రిందబడిపోయెను. ఆవీరుడే చంద్రావతియనియు సుకే శిని మారునామాంతరమనియు యామెనడవడికి శ్రీజలాశ్చర్య మగ్నమానసులైపోయిరి. శైత్యోపచారములవలన నామె తె చెను. బాలయోగి యానధయుండే యుండెను.

ఓమ్మాట విమలుని ప్రాణరక్షణ మొనర్చిన బాలయోగిని గురించి వారు ప్రశ్నింపగా వెనుకటి పిచ్చివా డచటందరకు ప్రత్యక్షమై 'రాకుమారా! ఈబాలయోగిని ఆరావళీపర్వతప్రాంతమునుండి దప్పించితిని. నాయున్మాదముచే నామెపరిరక్షింపబడినది విమలుని ప్రాణములునిలబెట్టి, వసంతునికి యుద్ధమందుచావుదప్పించి ప్రజలనందరిని సంతోషబరచిన యీబాలయోగి నేమనవచ్చును. పుట్టిబుద్ధెరిగినవాటినుండియు యువరాజునే నమ్మినయువతి. ఎన్నికష్టములు కలిగినను రాత్రింబవలు యువరాజునేస్మరించు పతివ్రతామతల్లి నిజజనకుని కపటకృత్యములనెల్ల కనులారగాంచి దుఃఖితయై పోయినయబల నిద్రాహారములువీడి కొండలనడుమ కొసప్రాణములతో వసంతనామజప మొనరించు పుణ్యశీలయగు సౌదామినీదేవియే యిప్పుడీ సభయందు బాలయోగియయ్యెను. ఆకల్యులకంద రానంద మొందిపోయిరి బాలయోగియె సౌదామిని. వెంటనే సౌదామినిసంతఃపురమునకు గొనిపోయిరి

ఉన్మాదుడు తనశరీరముపైనున్న జీర్ణవస్త్రములు తొలగించివైచి ముఖమున నలందుకొనిన మసిని దుడిచివైచుకొని కలకలలాడుముఖముతో నీలకంఠుడైపోయెను. సభయందంద రానందమగ్నులైరి. వసంతుడు లటాలున గద్దెదిగి నీలకంఠుని కౌగలించుకొని నీవృత్తాంతమేమని ప్రశ్నించెను.

"నీలకంఠుడు అయ్యా! నాటిరాత్రి అనగా కాల్దేవుని ముట్టడినాటిరాత్రి మిమ్ములనొకచోట నన్నొకచోట బంధించిరి. నేను అదిగని వాకట్లను విప్పివైచుకొని ఎవ్వరికి గానరాకుండ మారువేషమున మిమ్మును జేరి మహారాణిగార్ని, నిన్ను మారుత్రోవల కోటదాటించితిని. మీరిరువురతివేగముగ పారి

పోయిరి. ఆఅంధకారమున మిమ్ము నంటివచ్చుటకుగాని పిలచు
టకుగాని వ్యవధిచాలక అచట యిటునటు దిరుగుచుండ నొక
భిల్లునన్ను బట్టుకొనెను. నేనపుడు స్త్రీవేషధారినైయుండుటచే
మీరుగూడనన్ను సుకేశినియని భ్రమజెందిరి. ఆతరుణము పా
యస్థితి యందుండుటచే నేనేమియు మారుపలుకక యూరకుం
టిని. ఆభిల్లునేను స్త్రీనని భావించి నన్ను బరిణయ మాడెను.
నేనుగూడవల్లెయంటిని. ప్రాణభీతిచే నిజము బల్కిన చంపివే
యుదురని తలంచితిని. నాటిరాత్రి భిల్లులు భిల్లాంగనలు నన్ను అం
తఃపురమున కాభిల్లునితో బంపియుండిరి. ఇరువురమును పురుషు
లమే. భిల్లుడు నన్ను బలిమిని బట్ట యత్నింపగా కొంతకపట
స్త్రీయభినయముల జూపితిని.

భిల్లుడు మోహమగ్నుడైపోయెను. అప్పటికే చాలరాత్రి
కాలముమీరియుండెను. అందరు నిద్రాముద్రితులైరి. ఆభిల్లున
న్ను కౌగలించెను. అట్టియెడదను పోగొట్టరాదనియు నిజము తేలిన
పిమ్మట భిల్లుచే చావనెందులకనియు నాగుప్తకటారితో నాతని
కంఠమున తీవ్రముగ బొడిచివైచితిని ఆతడు కిక్కురు మన
కుండ ప్రాణములు వీడెను. వెంటనే యాగదితలుపులం దెరచు
కొని ఇతరుల కంటబడకుండ ద్వారములన్నియు గడచితిని. ఒక
ద్వారమునొద్దనుండిన భిల్లుడు మరల నన్ను బట్టుకొనెను. ఆతని
నిగూడ యమపురికంపి యావలకు దాటిపోయితిని. ఆమరునాడు
నాగృహమునుండి అన్నియు జక్కపర్చుకొని పిచ్చివాని విధం
బున అరచుచు ఏడ్చుచు నాపురమువీడి మీకొరకు సౌదామిని
కొరకు వెడలిపోయితిని. భిల్లవాటిక చేరితిని. భిల్లులు నాకును
సౌదామినికిని చిత్రముగ బరిణయ మొనరించిరి.

వారలందరారాత్రి మత్తుగద్రావి యొడలెరుంగని తరు
ణమున సౌదామినికి నన్నరిగించుకొని యామెచే పురుషవేష

ము ధరింపజేసి యామహాయోగులకు గన్పడనీయక సర్వదా కాయుచు ఆతల్లికి వందనమాచరించుచు అనేక క్లేశములు దిరిగితిమి. ఈయు ద్ధయాత్రవిని కోటద్వారము పగిలిపోవు నంతలో మేమిరువు రము మిమ్ముచేరితిమి" అనెను. బ్రాహ్మణతేజ మజేయంబని సభయంతయు ఆనందాబ్ధిలో మునిగిపోయిరి.

పిమ్మట నీలకంఠు డొకయాసనముపై గూర్చుండెను.
నాటిసభ యానందమయమైపోయెను.

# మా ల

## ముప్పదియొకటవ ప్రకరణము.

ము గిం పు.

సౌదామినీ వసంతులకును, విమలసింహ చంద్రావతు లకును మిక్కిలి వైభవముతో పరిణయములు గావించిరి సన త్కుమారుడు పెండ్లిపెద్ద, శాంతాదేవి మహారాణి, పరమానంద మునవచ్చినపేరంటాండ్రకు చందనకర్పూర తాంబూలము సుఖా సీనులజేసి రత్నహారములిచ్చి బ్రాహ్మణముత్తైదువులకిచ్చిరి.

వివాహములవిషయమై వర్ణింప మరియింత గ్రంథమగును.

గొప్పవారిండ్ల జరుగుమహావైభవములు జరుగునని తలం చుకొనిన చాలును. విమలసింహుడు మంత్రియయ్యెను. నీల కంఠుని కేమిచ్చినచెల్లదు. కొన్ని అగ్రహారములిచ్చిరి. నీలకం ఠుని మేనమామ కుమార్తెనుచూడ రప్పించి అచటనే వైభవ ముతో వివాహము జరిగించిరి. రాజు, మంత్రియు పిన్నవారని

సనత్కుమారుడు రాజ్యమునందు కొన్నికట్టుపాట్లను సవరించెను. స్వర్గప్రాంతములకేగి చోరులనుహరించ్చి ధనాగారమును వారు తీసివేయుగ మిగిలినదానిని తిగ్గిచేర్చిరి సనత్కుమారునికి శాంతాదేవికి విశేషచీనిచీనాంబరములు బహుమతినిచ్చిరి. కొద్దికాలము పోయినపిమ్మట సనత్కుమారు డుదయపురికి జేరుకొనెను. సత్యవతీదేవి యాజ్ఞను సనత్కుమారుడు దద్వితీయుడై రాజము పాలించుచుండెను.

ఒకనాటిసాయంకాలమున కొలదికాలమునకు చంద్రుడు కిలకిలనవ్వుచుండెను. సురభితకుసుమములనుండి దివ్యపరిమళము వెదజల్లుచుండెను. మలయమారుతము వీచుచుండెను. ఆచక్కనియుద్యానవనమున వెనుకటిసుందరతమమగు యుద్యానవనమున సౌదామిని మిగుల స్వచ్ఛమగు చలువమజిలి ధరించి విలువగల రత్నాభరణములతో దేదీప్యమానముగ జగన్మోహినివలె యాయిసుకతిన్నెపై నడయాడుచుండెను

వసంతసింహుడు విలువగు తెల్లనిగౌనుదాల్చి కంఠమున మంచి ముత్యములతో గూర్చబడిన హారమునుదాల్చి దాంబూలరాగయుక్తములగు పెదవులనుండి చిరునవ్వు కందళింప నాయారామముచేరెను అత్తరి సౌదామినీ రేకత్రిదయావన మోహనాకారమూర్తిని గన్నులుమిరుమిట్లు గొల్పెను. ప్రాణనాథుని చూచి పులకాంచిత దేహురాలై సౌదామిని కనులట్టిచుర మోడ్చెను. వెంటనే వసంతుడా "ప్రియసజీయుని యామెపై వంగి తనబాహువులచే నాసింహమధ్య నెన్నడుముబట్టి లేవనెత్తి తనవక్షస్థలములనట్టిహత్తించికొనిహృదయపూర్వకముగనా మె ముదుకపోలములపై త. తీయని ముద్దులశృంగారములకించెను

సంపూర్ణ పూర్ణిమాచంద్ర మండలమును ధిక్కరించు యామెను ఖబింబము నుండి చిరునవ్వు వెన్నెలల వసంతునిమరింత మోహాబ్ధిమునుంగజేసెను

"ప్రాణప్రియా! నేటికిగదా! నాజన్మపావనంబాయెను.

ఇరువురతిముదలమున తమ యంతఃపురమునకుబోయిరి.

కుమార వసంతసింహుడు చక్రవర్తియయ్యెను. విమలసింహుడు మహామంత్రియయ్యెను. కొడుకును కోడలునుజూచుకొని మహారాణిమిక్కుటమగు యానందమునమునిగిపోయెను. కొద్దికాలమునకు సౌదామినొక పుత్రికారత్నమును గాంచెను.

ఆబాలామణి రూపురేఖవిలాసములకు వారుముదమంది సుకేసినియని నామకరణము జేసిరి.

విమలసింహునకొక పుత్రుడుదయించెను. ఆసుందర బాలకునికి సనత్కుమారుడని నామకరణము జేసిరి.

మహారాణి యాబాలబాలికల ముద్దులు ఆటపాటలుంజూచుచు సదా వారితో నుండెను.

వసంతసింహుని పరిపాలన ధర్మరాజపాలనమయ్యెను. ప్రజలందరు తమరేనియాజ్ఞకు విధేయులై సుఖించుచుండిరి. మనమేలుంట్టి పాలనకు ముదమొందరాదు.

మనముచూడ వంతసంబోదముగాక

సంపూర్ణము.

రాబోవునవల

# రత్నకంకణము.

డిటెక్టివ్.

[illegible]

# నవలలు.

## డిటెక్టివు నవలలు.

| | | | |
|---|---|---|---|
| మాయావి | 1-8 | మాయామందిరం | 1-0 |
| మనోరమ | 1-8 | కాలసర్పం | 1-0 |
| మాయావిని | 0-12 | ప్రతిక్రియ | 0-12 |
| భయిరవాఖడ్గము | 0-12 | వసుంధర | 0-12 |
| దేవేంద్రబాబు | 1-0 | బంగారుబరిణ 1వ భాగం | 1-0 |
| శక్తికుమారి | 0-12 | డిటో 2వ భాగం | 1-0 |
| దొంగలనాయకుడు | 0-12 | సుడిగాలి 1 వ భాగం | 1-0 |
| పరిశోధన | 0-12 | డిటో 2 వ భాగం | 1-0 |
| సీవేనా | 0-12 | వాడేవీడు | 0-12 |
| వలపులరాణి | 1-0 | ఘోరకలి | 0-12 |
| భయంకరవారిపిచాచి | 1-0 | శిశుహత్య 1 వ భాగం | 1-0 |
| ప్రతాపదార్జన్యం | 0-12 | శిశుహత్య 2 వ భాగం | 1-0 |
| చోరాగ్రేసరచక్రవర్తి | 0-12 | శిశుహత్య 3 వ భాగం | 1-0 |
| పెనుభూతముజాగ్రత | 1-0 | పేటికాంతరశవము | |
| చోరాబహుదూరు | 1-0 | 1 వ భాగం | 0-12 |
| విషమందిరం 1 వ పార్టు | 0-12 | 2 వ భాగం | 0-12 |
| విషమందిరం 2 వ పార్టు | 0-12 | రూపసుందరి | 0-12 |
| రమాసుందరి | 1-0 | సరళ | 0-12 |
| దురాశ | 1-0 | అగ్గిరాముడు | 0-12 |
| పంజాబ్ మెయిలు | 0-12 | దొంగరాముడు | 0-12 |
| మోహాంధకారము | 1-0 | పాతాళగృహము | 1-0 |

వలయును వారు:— పులిపాటి రంగయ్య,

శ్రీరంగాబుక్ డిపో, చీరాల

సంపూర్ణ పూర్ణిమాచంద్ర మండలమును ధిక్కరించు యామెను ముఖబింబము నుండి చిరునవ్వు వెన్నెలల వసంతునిమరింత మోహాబ్ధిమునుంగజేసెను

"ప్రాణప్రియా! నేటికిగదా! నాజన్మపావనంబాయెను.

ఇరువురతిముదలమున తమ యంతఃపురమునకుబోయిరి.

కుమార వసంతసింహుడు చక్రవర్తియయ్యెను. విమల సింహుడు మహామంత్రియయ్యెను. కొడుకును కోడలునుజూచు కొని మహారాణిమిక్కుటమగు యానందమునమునిగిపోయెను. కొద్దికాలమునకు సౌదామినొక పుత్రికారత్నమును గాంచెను.

ఆబాలామణి రూపురేఖవిలాసములకు వారుముదమంది సుకేసినియని నామకరణము జేసిరి.

విమలసింహునకొక పుత్రుడుదయించెను. ఆసుందర బాలునికి వసంతకుమారుడని నామకరణము జేసిరి.

మహారాణి యాబాలబాలికల ముద్దులు ఆటపాటలు జూచుచు సదా వారితో నుండెను.

వసంతసింహుని పరిపాలన ధర్మరాజపాలనమయ్యెను. ప్రజలందరు తమరేనియాజ్ఞకు వినయులై సుఖించుచుండిరి. మనమేలయిట్టి పాలనకు ముందెమోదరాదు.

మనముచూడ నంతసంబరముదముగాక

సంపూర్ణము.

---

రాబోవునవల

# రత్నకంకణము.

డిటెక్టివ్.

88 వ పేజీమొదలు శ్రీరామప్రెస్సునందు ముద్రింపబడెను, రాజమండ్రి.

# జ్యోతిష ప్రభావము.

ఇది బ్రహ్మశ్రీ. సిద్ధాంతి శిరోభూషణ పండిత దోగు పర్తి స్వామిగుప్తగారిచే రచియింపబడినది. ఈఅమూల్య గ్రంథ రాజమునందు జాతకభావ, ప్రశ్నభావ, అరూఢభావ, ముహూర్తభావ, సిద్ధాంతభావ, గోచారభావ, వాస్తుభావములు మొదలగు అనేకవిషయములను సంగ్రహముగను జ్యోతిశ్శాస్త్రమందలి సొల్లమర్మములను సులభముగను బోధించునది యైయున్నది.

దీనివెల ప్రతి 1 కి రు 1—4—0 మాత్రము. ఇవిగాక యింకా మాషాపున అనేకరకముల జ్యోతిషగ్రంథములు, వైద్యగ్రంథములు, నవలలు, నాటకములు, ప్రబంధములు దొరకును, హరికథలు కూడా దొరకును.

పులిపాటి రంగయ్య,
బుక్ సెల్లర్ అండ్ పబ్లిషర్,
శ్రీరంగా బుక్కుడిపో, చీరాల

